## చందాదారులకు మనవి



పైనెల చందమామ యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీలోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడువచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.

మేనేజరు

# శుభ వార్త!

పిల్లలకు ఆనందమును కలిగించే

# చందమామ

మరి రెండు భాషలలో వెలువడుతున్నది:

## చందమామ (ఇంగ్లీషు)
## జహ్నమాము (ఒరియా)

ప్రారంభ సంచిక **15** జూన్ **1955**న
విడుదల అవుతుంది



ఏజన్సీ షరతులకు వ్రాయండి.

| సంవత్సర చందా | విడి సంచిక |
|---|---|
| రు. **4-8-0** | **0-6-0** |



ఇప్పటికి తొమ్మిది భాషలలో వెలువడే పత్రిక ఇది ఒక్కటే!

బెంగాలీ, సింధీ భాషలలో కూడ
చందమామ త్వరలోనే రానున్నది



## చందమామ పబ్లికేషన్స్

మదరాసు - **26**

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

---

ముఖ్యంగా - గత డిశెంబరు, ఈ మార్చి సంచికల ముఖచిత్రాలకథలు చాలమంది పాఠకులను ఆకర్షించడం సంతోషింపతగ్గ విషయం. 'ఈ గాథలు ఎక్కడివి?' అని ప్రశ్నిస్తూ, వారు వివరాలు కోరారు. ప్రస్తుతం ముఖచిత్రాలుగా చిత్రిస్తున్న ఇతిహాసాలన్నీ మహాభారతంలోనివే అని మా జవాబు. మన చందమామలో 16 నెలలుగా నడుస్తున్న మొట్టమొదటి త్రివర్ణచిత్ర సీరియల్ 'తోకచుక్క' వచ్చే నెలలో అంతర్ధానమవుతుంది. అట్ట చివరిబొమ్మ 'మాయాచక్రం' కథ ఈనెలలోనే ఐపోయింది. జూలైనెలలో అద్భుతమైన కొత్త త్రివర్ణ సీరియల్ కథ, అట్టచివరి బొమ్మకు చక్కటి చీనాకథ ప్రారంభిస్తున్నాము. అంతేకాదు. మరికొన్ని భాషలలో చందమామకూడా జూలైలోనే అవతరించబోతున్నది.

మే 1955



సంపుటి 16
సంచిక 5

# నగారాల చిక్కడు!

మొగరాలను పట్టణమున
నగారాల చిక్కడు
జగమెరిగిన సర్దారుడు
చలాకైన చోరుడు!

మొగరాలకు మొగుదాలను
నాగలమ్మ దేవత
గుడి యున్నది తరతరాల
గొప్పదైన దేవళం!

ఒక్కనాడు నగారాల
చిక్కడు ఆ దేవత





చక్కనైన నగల గాంచి
ఒక్క యుక్తి పన్నెను.

నగము రేయి కావచ్చెను
జగము నిదురబోయెను,
నగారాల చిక్కడపుడు
నాగులు గుడి చేరెను!

తలుపు గడియవేసి లోన
గల నగలను దోచెను,
అలికిడి విని కావలోడు
తలుపు చిలుకు వేసెను!

మొగరాలకు వెళ్ళి ఊరి
మగవారిని లేపెను





(గేయకథ)

దక్కెను ప్రాణంబు లనుచు
చక్కగ పరుగెత్తిరి!

నగారాల చిక్కడంత
నగల మూట గట్టెను
నాగలమ్మ వేషమ్మును
నవ్వుకొనుచు విప్పెను!

దూరమ్మున కావలి ఆ
తీరు జూచి నంతనే
చోరుడు! దేవత కాదని
బోరున విలపించెను!

నగారాల చిక్కడున్న
నాగుల గుడి చేరెను!

ఈటెలు బరిసెలు దెచ్చిన
పోటరులందరు నిల్చి క
వాటములను దెరువగానె
పాటవమున దేవత—

ఓం ఓం ఓం కాళీ యని
హుంకరించి దుమికెను
రంకెలు వేయుచు వారల
వంక ఉరిమి చూచెను!

దేవత దేవతరా యని
దిక్కు దిక్కు జూచుచు



# అట్టపీది బొమ్మ

ధర్మాత్ములైనటువంటి పాండవులు నిర్విఘ్నంగా అరణ్యవాసం సాగిస్తూ వచ్చారు కద! వారు సంచారం చేసిన పది సంవత్సరాల కాలమూ పది క్షణాలుగా గడచిపోయింది. ఈ అవధిలో భీమార్జునులకు ఎన్నెన్నో కొత్త శక్తులు లభించినై. ఈ సమయంలోనే యుధిష్ఠిరుడి ధర్మబలంకూడా పరీక్షకు నిలిచి, నెగ్గింది. వనవాసం పూర్తికావడానికి ఇంకొక్క రెండేళ్లు మాత్రమే గడువున్నది.

ఇలా పంచపాండవులూ ద్రౌపదీ, సరస్వతి నదీ తీరాన సాగుతూ, ద్వైత వనం చేరుకొన్నారు. అక్కడినుండి బయల్దేరి, ఋషులనూ, బ్రాహ్మణులనూ వెంటబెట్టుకొని వారు సరాసరి కామ్యకవనానికే వచ్చేశారు.

ఒక రోజున, అర్జునుడి స్నేహితుడైన బ్రాహ్మణుడు ఒకాయన, ఆత్రంతో పరుగున వచ్చి, సత్యభామాసమేతుడై శ్రీకృష్ణభగవానుడు విచ్చేస్తున్నా డనే శుభవార్త తెలిపాడు.

పాండవులు సంతోషభరితులై, ఆపద్బాంధవుడైన శ్రీకృష్ణునికి ఎదురు వెళ్లి అత్యంత ఆదరంతోను, భక్తితోనూ స్వాగతమిచ్చారు. కృష్ణుడు పాండవ సోదరులనూ, సత్యభామ ద్రౌపదీదేవినీ దివ్యాలింగనాలతో పరస్పరమూ సత్కరించుకొన్నారు.

తరువాత అందరూ విశ్రాంతిగా కూర్చుని, ఎంతో ఆప్యాయంతో ఒకరి నొకరు కుశలప్రశ్నలు వేసికొనడంలో నిమగ్నులైనారు.

ఇంతవరకూ గడచిన అరణ్యవాస విశేషాలూ, అనుభవాలూ శ్రీకృష్ణునితో యుధిష్ఠిరుడు పూసగుచ్చినట్టు వివరించాడు. భగవానుడైన కృష్ణుడికి ఇవన్నీ తెలియవా! అన్నీ విని, చివరకు శ్రీకృష్ణుడు—"కర్తవ్యనిష్ఠులైన మీరు కష్ట సుఖాల భేదాన్ని పాటించరని ఎరుగుదును. మీకు కీడు తలచినవారికి అంత్య ఘట్టం వచ్చింది. వనవాసంలో మీకు ఎంతటి కొత్త శక్తులు లభించినవో, అంతవరకూ దుర్యోధనుడి శక్తి క్షీణించిందన్నమాట. మిగిలివున్న కొద్దిపాటి కాలమూ అరణ్యవాస, అజ్ఞాతవాసాలు నిశ్చింతతో ముగించండి. మీకు శుభ మవుతుంది" అని హితవు చెప్పాడు.

పాండవులూ, అక్కడ వున్న అందరూ 'జయ జయ శ్రీ కృష్ణా!' అంటూ పరవశులై భగవానుణ్ణి కీర్తించారు.



# నవకోటి నారాయుడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే టప్పుడు ఒక మహాధనికుడుండేవాడు. ఆయన తొమ్మిదవ కోటి పూర్తిచేసి, పడగ ఎత్తే సమయానికి ఒక కొడుకు పుట్టాడు. అందుచేత కొడుక్కి అప్యాయంగా 'నవ కోటి నారాయుడు' అని పేరు పెట్టాడు.

నారాయడికి తండ్రి, లేదనకుండా కోరిన కోరికలన్నీ తీర్చేవాడు. అందుచేత కుర్రవాడు ఆడింది ఆట, పాడింది పాట ఐంది. అతడు దుష్టులతోను దుండగీళ్ళ తోనూ సహవాసం చేయసాగాడు.

ఏమైతేనేం, యుక్తవయస్సు వచ్చేసరికి తండ్రి ఒక చక్కటి పిల్లనుచూచి నారాయ డికి అతి వైభవంగా పెళ్ళి జరిపించాడు. మరికొద్దికాలానికే ఆయన కాలంచేశాడు.

చిన్నప్పటినుంచీ నారాయడు హద్దూ పద్దూ లేకుండా చేస్తూవచ్చిన బాకీలన్నీ తడిసి మోపెడై, తండ్రి పోయేసరికి, కాల సర్పాలలాగ వచ్చి పట్టుకున్నాయి. ఋణ దాతలందరూ ఒక్కసారిగా వచ్చి చుట్టు కున్నారు. ఈ స్థితిలో నారాయడికి జీవిత మంటే నిస్పృహ తోచింది. గత్యంతరం కానక, చివరకు చస్తే మేలనిపించింది. ఏమీ బదులు చెప్పలేక, నారాయడు వారితో—'అయ్యా!—నేను గంగ ఒడ్డున ఫలానా రావిచెట్టుకింద ఉంటాను. అక్కడ మా పూర్వులు వదిలివెళ్లిన నిక్షేపమున్నది. మీమీ పత్రాలన్నీ పట్టుకుని అక్కడకు రండి' అని చెప్పాడు.

అవుననుకొని అందరూ ఆ రావిచెట్టు వద్దకు వెళ్ళి సిద్ధంగా వున్నారు. నారాయడు నిక్షేపంకోసం వెతుకులాడుతున్నట్టు నడి రాత్రివరకు అటుయిటు తచ్చాడి, వాళ్లు అదమరపుగా వుండటం చూచి గభీమని గంగలోకి దుమికేశాడు. 'జయ్ పరమేశ్వరా!' అని అతడు జాలిగా కేకవేసేటంతలో




ప్రవాహ వేగం అతణ్ణి ఎంత దూరమో లాక్కుపోయింది.

* * *

ఆ కాలమందు బోధిసత్వుడు ఒక లేడిగా జన్మించి, తక్కిన లేళ్ళ మందలకు దూరంగా, గంగాతీరాన, లతలు పొదలు అల్లుకొన్న ఒక మామిడితోటలో నివాసం ఏర్పరచుకున్నాడు. ఈ లేడి అన్నివిధాలా ప్రత్యేకత కలది—బంగారు శరీరచ్ఛాయ, లక్కవంటి కాళ్లడెక్కలు, వెండి కొమ్ములు, రత్నపు పాళ్లలాగా జిగజిగ మెరిసే చక్కటి కన్నులు,—ఇటువంటి అపూర్వ సౌందర్యంతో ప్రకాశిస్తున్నదీ లేడి.

ఈ లేడికి అర్ధరాత్రిసమయాన విపత్తులో వున్న ఒక మానవుని ఆక్రందనం వినిపించింది. 'ఏమిటీ దీనాలాపం!' అనుకొంటూ, బంగారు లేడి లేచి, ఎదురీది పోయి నారాయడి వద్దకు చేరుకొన్నది.

'నీకు వచ్చిన భయంలేదు, నాయనా!' అంటూ అది వానికి ధైర్యం చెప్పి, వానిని వీపుపైన ఎక్కించుకొని తీరం చేరుకొని, తిన్నగా తన బసకు తీసుకపోయింది. అతడు తేరుకొనేవరకూ ఆ లేడి అరణ్యంలోనించి ఫలాదులు తెచ్చి నారాయడికి ఆకలి దప్పులు తీర్చింది.

తరువాత ఒక రోజున 'నాయనా!—నిన్ను ఈ అరణ్యం దాటించి మీ రాజ్యానికి దోవ చూపిస్తాను. క్షేమంగా వెళ్ళిపో. ఐతే ఒకే ఒక్క కోరిక—పట్టపురాజుగాని మరే శ్రీమంతుడుగాని నిన్ను ఎంతగా ఆకర్షించి నప్పటికీ, ఫలానిచోట బంగారు లేడి వున్నది అనే సంగతిమట్టుకు వెల్లడించవద్దు. ఇదే నా కోరిక' అని చెప్పింది.

సరేనన్నాడు నారాయుడు. ఈ వాగ్దానం నమ్మి, బంగారులేడి వానిని తన వీపుపైన ఎక్కించుకొని కాశీరాజ్యానికి పోయే బాట మీద వదిలిపెట్టింది.

* * *



సరీగా నారాయడు కాశీపట్టణం చేరుకొన్న రోజునే ఒక చిత్రం జరిగింది. అంతకు క్రితం రాత్రి పట్టపురాణికి కలలో ఒక సుందరమైన బంగారులేడి కనిపించి, ధర్మ బోధ చేసిందట. రాణి తన భర్తవద్దకు వచ్చి 'అసలు లోకంలో ఉండకపోయి నట్టయితే ఇటువంటి లేడిరూపం నాకెం దుకు కనబడుతుంది? ఉండే తీరాలి. దాన్ని వెంటనే నాకు పట్టితెస్తేనే తప్ప, జీవాలు నిలవవు' అంటూ పట్టుపట్టింది.

తక్షణమే రాజు సభతీర్చాడు. సలహాలు చేశాడు. చివరకు చేసిన ఏర్పాటు ఏమంటే: ఒక ఏనుగుమీద అంబారీ, అంబారీలో బంగారు బరిణె, బరిణెలోపల వెయ్యి మొహిరీలు— వీటితో అది ఊరేగుతుంది. బంగారు లేడిని గురించిన భోగట్టా ఎవరైతే ముందుగా చెపుతాడో, వానికి బరిణెలోని మొహిరీలను బహుమతిగా ఇస్తారు.

ఈ విధమైన ఒక ప్రకటన స్వర్ణపత్రం మీద లిఖింపించి, సేనాని ఊరూ రా దండోరా వేయించాడు. సరిగా ఈ దండోరా వేసేసమయానికే నారాయడు కాశీనగరంలో అడుగు పెట్టాడు.

అతడు సేనానివద్దకు వచ్చి 'అయ్యా, మీకు కావలసిన ఆ బంగారు లేడిని గురించి




నాకంతా తెలుసు. నన్ను ప్రభువుదగ్గరకు తీసుకపోండి, మనవి చేస్తా' అన్నాడు.

తరవాత నారాయడు రాజునూ పరి వారాన్నీ వెంటబెట్టుకపోయి, బంగారు లేడి నివసించే ఏకాంతస్థలం చూపించి, తను అల్లంతదూరాన నిలబడ్డాడు.

రాజుగారి పరివారం ఒక్కసారిగా గొల్లు మని కేకలేశారు. లేడిరూపంలో వున్న బోధిసత్త్వుడు ఆ శబ్దం విన్నాడు.

'ఎవరో గొప్ప అతిథి వచ్చివుండాలె. స్వాగతమిద్దాం' అనుకుంటూ ఆతడు లేచి, అందరనూ తప్పించుకొని, తిన్నగా రాజు నిలబడ్డ చోటికి పోబొయ్యాడు.



లేడియొక్క వేగానికి రాజు ఆశ్చర్యపోయాడు. విల్లమ్ములు తీసుకొని, లేడికి ఎక్కుపెట్టాడు. అప్పుడు లేడి ఇలా అన్నది: 'రాజా!—ఆగు, తొందరపడకు, నా ఉనికిని గురించి నీకు చెప్పినవారెవరు?'

రాజు చెవులకు ఈ మాటలు అమృత తుల్యంగా వినబడినై. అయనకు తెలియకుండానే విల్లమ్ములు కిందపడినై.

నిదానమైన మధుర స్వరంతో బోధిసత్వుడు 'రాజా!—నా ఉనికిని నీకు తెలిపిన దెవరు?'' అని మళ్ళీ ప్రశ్నించాడు. రాజు నారాయడిని వేలుపెట్టి ఆనవాలు చూపించాడు.

అప్పుడు బోధిసత్వుడు ఇలా ధర్మం చెప్పాడు: 'లోకంలో మానవుని మించిన కృతఘ్నుడు లేడని శాస్త్రాలు చెప్పినమాట నిజం. జంతుభాష తెలుసుకోవచ్చు, పక్షి భాష తెలుసుకోవచ్చు. కాని, మనిషిమాట అర్థంచేసుకోవడం బ్రహ్మతరం కాదు.' అంటూ, తను నారాయడిని రక్షించి, అతని వద్దనుంచి వాగ్దానం తీసుకొన్న వృత్తాంత మంతా రాజుకు వివరించాడు.

రాజు ఉగ్రుడై, 'ఇదా సమాచారము! ఇటువంటి కృతఘ్నుడు, మహాపాపి లోకానికి పీడ. ఒక్క బాణంతో వీణ్ణి హతమారుస్తాను' అని బాణం తీశాడు.

బోధిసత్వుడు అయనను వారించి—

"రాజా!—చంపవద్దు. ప్రాణం తీస్తే ఏముంది? బ్రతికివుంటే ఏనాటికైనా వాడికే బుద్ధివచ్చి బాగుపడతాడు. నీ వాగ్దానం ప్రకారం వాడికీయవలసిన బహుమతులు కూడా ఇచ్చివెయ్యి. ఇదే న్యాయం" అని హితబోధచేశాడు. అలానే చేశాడు రాజు.

బోధిసత్వునిలోని ఔదార్యమూ, క్షమా మొదలైన మహత్తర గుణాలన్నీ అప్పుడు బోధపడినై రాజుకు. బోధిసత్వుడు మహానుభావుడని గుర్తించి, అయనను తన రాజ్యం నడిపించే సారథిగా ఎంచుకొన్నాడు.






# సరస్వతీ కుటుంబం

అమరావతీపట్టణంలో ఒక పేద కుటుంబం ఉండేది. వారిని అందరూ సరస్వతీ కుటుంబమని చెప్పుకునేవారు. ఎందుచేత నంటే, ఆ కుటుంబంలో చేరిన బ్రాహ్మడూ, ఆయన భార్యా, వారి కుమారుడూ, కోడలూ కూడా పండితులు, ధారాళంగా కవిత్వం చెప్పగలవారు.

వారు దారిద్ర్యంబాధ పడలేక, తమ వంటివారికి భోజరాజు చక్కని సన్మానా లిస్తాడని విని, ఒకనాడా నలుగురూ ధారా నగరానికి ప్రయాణమై వచ్చారు. ధారా నగరం అంతదూరంలో ఉందనగా వారికొక బ్రాహ్మణు డెదురుపడి తండ్రితో, "అయ్యా, తమ ప్రయాణం ఎక్కడికి?" అని ఆదరంగా అడిగాడు.

"సమస్త వేదపురాణాలూ తెలిసిన భోజరాజు దర్శనార్థం వెళుతున్నాం," అన్నాడు తండ్రి వినయంగా.

"వేదపురాణాలేం చదివాడో ఆ భోజ మహారాజు, ఆయనకు అక్షరాలు చదవ టమే రాదు. లేకపోతే, బ్రహ్మదేవుడు నా నొసట రాసిన దారిద్ర్యరేఖ చదివికూడా ఇంత ధనం ఇస్తాడా?" అంటూ ఆ బ్రాహ్మడు వెళ్ళిపోయాడు.

ఈ మాటలు వినగానే సరస్వతీకుటుం బానికి అంతులేని ఆనందం కలిగింది. భోజరాజు నిజంగానే గొప్పదాతా, దరిద్రుల పట్ల ఆదరం కలవాడూ అయిఉండాలని వారు తెలుసుకున్నారు.

పరదేశీయులు రాజాజ్ఞ లేకుండా నగరం ప్రవేశించే అధికారం లేదు. అందుచేత సరస్వతీకుటుంబంవారు ఊరిబయట ఒక మర్రిచెట్టుకింద విడిది ఏర్పాటుచేసుకుని నగరులోకి తమ రాకగురించి కబురుచేశారు.

కొంతసేపయాక రాజుగారి నౌకరు ఒకడు లోటా నిండా పాలు తెచ్చి, "రాజుగా

బి. కె. అవధాని



రిమ్మన్నారు," అని కుటుంబపెద్ద అయిన బ్రాహ్మడికిచ్చాడు.

"మా నగరంనిండా పాలవంటి పాండిత్యంగలవా రున్నారు. మీకు చోటెక్కడ?" అని భోజరాజు అభిప్రాయం. బ్రాహ్మడిది గ్రహించి, ఆ పాలలో ఇంత చక్కెర కలిపి, "ఇది తీసుకుపోయి రాజుగారి కివ్వు," అన్నాడు.

"మీ నగరంలో ఉన్న పండితులలో మేముకూడా, పాలలో చక్కెరలాగా కలిసి పోయి, వారి పాండిత్యానికి తీపికూడా చేకూర్చుతాము," అని బ్రాహ్మడి భావం. ఇది గ్రహించి భోజరాజు సంతోషించాడు.

అయినా ఈ సరస్వతీ కుటుంబాన్ని ఇంకా పరీక్షించాలని ఆయనకు బుద్ధి పుట్టింది. అందుకని ఆయన తన దుస్తులు తీసివేసి సామాన్యుడి దుస్తులు ధరించి సూర్యాస్తమయవేళ మర్రిచెట్టువద్దకు వచ్చాడు. అక్కడ భోజరాజుకు అత్తాకోడళ్లుమాత్రమే కనిపించారు. తండ్రికొడుకులు సంధ్యావందనంకోసం ఏటికి వెళ్లిఉంటారని గ్రహించి భోజరాజు తాను కూడా అక్కడికి వెళ్ళాడు. అక్కడ బ్రాహ్మడికొడుకు కనిపించాడు. భోజరాజు అతనివంక ప్రశ్నార్థకంగా చూసి, నదినీళ్ళు దోసిట తీసి తాగాడు.

ఇలా తాగటంలో భోజరాజు ఉద్దేశం, "సముద్రాలను దోసిటపట్టి తాగిన అగస్త్యుడులాగా మీరు బ్రాహ్మలేకదా?" అని.

ఇది గ్రహించిన బ్రాహ్మణకుమారుడు, మారువేషంలో ఉన్న భోజరాజుకేసి ప్రశ్నార్థకంగా చూస్తూ, ఒక రాయి తీసి నీటిలో వేశాడు. "సముద్రంలో కొండలు వేసి వారధి కట్టిన శ్రీరాముడిలాగా మీరూ క్షత్రియులేకదా?" అని అతని భావం.

ఇది గ్రహించి సంతోషించినవాడై భోజరాజు ఇంటికి వెళ్ళిపోయాడు. కాని ఈ సరస్వతీ కుటుంబంవారిని ఇంకా దగ్గిరిగా

పరీక్షించి, వారి కవితాశక్తికూడా చూస్తే తప్ప భోజుడికి నిద్రపట్టేలా కనపడలేదు. అయన కట్టెలుకొట్టేవాడి వేషం ధరించి, కట్టెలమోపొకటి నెత్తిన పెట్టుకుని, ఆరాత్రి నగరద్వారం మూసేవేళకు బయటికి వచ్చి, మర్రిచెట్టుకింద మకాంచేసిఉన్న సరస్వతీ కుటుంబంవారిని చేరుకున్నాడు.

"అయ్యా, అడివిలో ఆలస్యమయిపోయింది. నగరద్వారం మూసివేశారు. మీ యిష్టంవచ్చిన ధరకు కట్టెలు కొనుక్కొని నన్నీ రాత్రికి ఇక్కడ పడుకోనివ్వండి. ఉదయమే నాదారిన నేను పోతాను," అని భోజరాజు కుటుంబపెద్దను అడిగాడు.

ఆ బ్రాహ్మడు తనదగ్గిర ఉన్నదానిలో కొంత భోజరాజు కిచ్చి, "అలాగే పడుకో, నాయనా? ఇదేం మా సొత్తా?" అన్నాడు.

అర్ధరాత్రివేళ దొంగల భయం ఉండవచ్చుకనుక, అందరూ నిద్రపోకుండా ఒక్కొక్క జాము ఒక్కొక్కరు మేలుకుని ఉండేటట్టు సరస్వతీకుటుంబంవారు నిశ్చయించుకున్నారు. మొదటి జాము తండ్రి మేలుకున్నాడు.

కొంతసేపయాక మారువేషంలో ఉన్న భోజరాజు—

"అసారే ఖలు సంసారే సార
మేతత్త్రయం స్మృతం"





అన్నాడు. అంటే దాని అర్థం "నిస్సార మైన సంసారంలో ఈ మూడూ సారము లైనవిగా భావించబడుతున్నవి" అని.

ఈ మాట విని, మేలుకుని ఉన్న బ్రాహ్మడు:

"కాశ్యాం వాసః, సతాం సేవా,
మురారే స్మరణం తథా"

అన్నాడు. "కాశీలో నివసించటం; సజ్జనులను సేవించటం; భగవన్నామస్మరణ చెయ్యటం," అని దాని అర్థం.

భోజరాజిది విని సంతోషించి పలకకుండా పడుకున్నాడు. ఆయన పెద్ద బ్రాహ్మడు గొప్ప పండితుడని గ్రహించాడు.

ఒక జాము పూర్తికాగానే బ్రాహ్మడు తన భార్యను లేపి తాను నిద్రపోయాడు.

కొంచెంసేపయాక బ్రాహ్మడి భార్యకు వినబడేటట్టు భోజరాజిలా అన్నాడు:

"అసారే ఖలు సంసారే సార
మేతద్ద్వయం స్మృతం"

("నిస్సారమైన సంసారంలో ఈ రెండూ సారములైనవిగా భావించబడుతున్నవి.")

అది విని బ్రాహ్మడి భార్య ఇలా చెప్పింది:

"కసార శ్శర్కరాయుక్తః
కంసారిచరణద్వయం"

("చక్కెరతో చేసిన పిండివంట, శ్రీహరి పాదాలు.")

మూడో జామున బ్రాహ్మడి కొడుకు మేలుకునివున్న సమయంలో భోజరాజు మళ్లీ ఇలా అన్నాడు:

"అసారే ఖలు సంసారే సారం
శ్వశుర మందిరం"

("నిస్సారమైన సంసారంలో సారమైనది అత్తవారి ఇల్లు")

దానికి బ్రాహ్మడి కొడుకు సమాధానం చెప్పాడు:

"హరశ్శేతే హిమగిరౌ, హరిశ్శేతే
పయోనిధౌ."

(శివుడు తన అత్తవారి ఇల్లయిన హిమ

వత్పర్వతంమీద పడుకున్నాడు, విష్ణువు తన అత్తవారి ఇల్లయిన పాలసముద్రంమీద పవళించాడు. శివుడి భార్య పార్వతి హిమవంతుడి కూతురు, విష్ణువు భార్య లక్ష్మి పాలసముద్రంలో పుట్టింది.)

ఇది విన్న భోజరాజు ఆనందానికి మేర లేదు. నాలుగో జాము మేలుకునే వంతు కోడలిదికాగానే భోజరాజిలా అన్నాడు:

"అసారే ఖలు సంసారే సారం
సారంగలోచనా"

(నిస్సారమైన సంసారంలో సారమైనది స్త్రీ)

ఇది విని బ్రాహ్మడి కోడలు, ఈ కట్టెలు కొట్టేవాడు భోజరాజేనని గ్రహించి, ఈ విధంగా చెప్పింది:

"యస్యాః కుక్షౌ సముత్పన్నో
భోజరాజ, భవాదృశః"

(ఓ భోజరాజా, నీవంటివారు ఏ స్త్రీ కడుపున పుడతారో ఆ స్త్రీ నిస్సారమైన సంసారంలో సారమైనది)

ఈ మాట చెవినిపడగానే భోజరాజు చివాలున లేచి ఆ చీకటిలోనే తన ఇంటికి వెళ్ళిపోయాడు.

ఉదయంకాగానే సరస్వతీ కుటుంబానికి భోజరాజు ఆస్థానంనుంచి ఆహ్వానం వచ్చింది. ఆ ఆహ్వానానికి సరస్వతీ కుటుంబంలోని ప్రతిఒక్కరూ ఎంతగానో సంతోషించారు. భోజరాజు మారువేషంలో వచ్చి తమకు పెట్టిన పరీక్షల్లో తాము నెగ్గామని వాళ్ళు గ్రహించారు.

అందరూ వెనువెంటనే అక్కడినుండి బయలుదేరి భోజరాజు ఆస్థానానికి చేరారు.

భోజరాజు సరస్వతీకుటుంబాన్ని ఎంతో ఆదరంతో స్వీకరించాడు. కుటుంబంలోని ప్రతి ఒక్కరూ సమాన పాండితీ ప్రతిభ గల వారేనని మెచ్చుకున్నాడు.

తరవాత ఆయన సరస్వతీకుటుంబం వారంపరినీ, నెలజీతాలమీద తన కొలువులో ఉంచుకుని ఆదరించాడు.






వితస్తా నదీతీరాన గల తక్షశిల నగరాన్ని కళింగదత్తుడనే రాజు పరిపాలిస్తూండే వాడు. ఆయన బౌద్ధమతం అవలంబించిన వాడు. అయితే ఆయన రాజ్యంలో వైదిక మతంలో నమ్మకం గలవారు చాలామంది ఉండేవారు. ఎందుచేతనంటే, బౌద్ధమతం అవలంబించమని ఆ రాజు తన ప్రజలను ఒత్తిడిచేయలేదు. ఇష్టమై తనవద్దకు వచ్చినవారికి మటుకు బౌద్ధమత సూత్రాలను ఉపదేశం చేస్తూవుండేవాడు.

ఇలా బౌద్ధమతం స్వీకరించినవారిలో వితస్తాదత్తుడనే ధనికుడైన వర్తకుడు ఒకడున్నాడు. ఆయన కొడుకు రత్నదత్తుడు మాత్రం వైదికమతాభిమాని. అందుచేత అతను తన తండ్రిని ద్వేషించి, ఎల్లప్పుడూ తిట్టిపోస్తూ వుండేవాడు.

"నువు పాపాత్ముడివి. అందుకే వేద ధర్మాన్ని మాని అధర్మం చేస్తున్నావు. బ్రాహ్మణ పూజ మాని బౌద్ధ బిచ్చగాళ్ళను పూజిస్తున్నావు. వేళకు స్నానం చెయ్యక, ఇష్టంవచ్చినప్పుడల్లా భోజనంచేస్తూ, తలలు గుండ్లు చేయించుకుని, అడిగేవాళ్ళు లేకుండా విహారాలలో సుఖంగా బతకటానికి నానా జాతులవారూ ఏకమయ్యే ఈ దిక్కుమాలిన మతం నీ కెక్కడ దాపరించింది?" అంటూండేవాడు.

కొడుకు అనే ఈ మాటలకు బాధపడి తండ్రి, "నాయనా, నువ్వు పైవేషాలే ధర్మమనుకుంటున్నావు. వంశానుగతంగా వచ్చేదే బ్రాహ్మణత్వ మవుతుందా? కామక్రోధాదులు వర్జించి, సత్యాహింసలను అవలంబించటం బ్రాహ్మణత్వం కాదా? అన్ని ప్రాణులకూ అభయం యిచ్చే ఈ మతాన్ని ఎందు కింత మాత్సర్యంతో ఎల్లప్పుడూ దూషిస్తావు? శాంత, ధర్మగుణాలను అలవరుచుకోవటం మంచిది," అన్నాడు.

ఆర్. చలపతిరావు

కాని ద్వేషంతో నిండివున్న రత్నదత్తుడికి తండ్రి మాటలు కొంచెమైనా రుచించలేదు. అతను తండ్రిని చాలా నీచంగా చూడసాగాడు. తండ్రీకొడుకులమధ్య అన్యోన్యతా, ప్రేమా నశించటంవల్ల గృహజీవితం భయంకరంగా పరిణమించింది. రత్నదత్తుడు వ్యాపార విషయాల్లో కూడా తండ్రికి సహాయం చేయటం మానేశాడు. అందుచేత వితస్తాదత్తుడు మహారాజు దగ్గిరికి వెళ్లి తన కుమారుడి వైఖరి వివరంగా చెప్పాడు.

అంతా విని రాజు, "ఏదో వంకపెట్టి రేపు నీ కుమారుణ్ణి ఆస్థానానికి తీసుకురా. సంగతేమిటో విచారిస్తాను," అన్నాడు.

కళింగదత్త మహారాజు చెప్పిన ప్రకారమే వర్తకుడు తన కుమారుణ్ణి మర్నాడు ఆస్థానానికి వెంట పెట్టుకు వెళ్లాడు.

రత్నదత్తుణ్ణి చూడగానే రాజు తారామండలంగా మండిపోయినట్టు నటిస్తూ, "ఈ దేశద్రోహిఅయిన పాపాత్ముడి శిరస్సు వెంటనే ఛేదించండి," అని భటులను ఆజ్ఞాపించాడు.

రత్నదత్తుడు ఆశ్చర్య భయాలతో నిర్ఘాంతపోయాడు. అతని తండ్రి రాజుతో, "మహారాజా, తొందరపడకండి! నిదానంగా విచారించి తమ యిష్టప్రకారం చెయ్యండి," అని వేడుకుంటూ అన్నాడు.



"సరే! వీడి శిరచ్ఛేదం రెండు నెలలు వాయిదా వేశాం. ఆతరవాత వీణ్ణి మాదగ్గిర హాజరు పెట్టు. ఇప్పటికి ఇంటికి తీసుకుపో!" అన్నాడు రాజు.

రత్నదత్తుడు ఇంటికి చేరి ఎంతో ఆలోచించాడు: "రాజుకు నేనేం అపచారం చేశాను? నన్నెందుకు చంపుతున్నాడు?" ఏమాలోచించటానికీ అతని బుర్ర పని చెయ్యలేదు. రాజు తనకు విధించిన చావు రాత్రింబగళ్ళు అతని మనస్సును కలవర పరచసాగింది. రెండు నెలల గడువు కాలం లోనూ అతను ఏ పూటా సరిగా భోజనం చెయ్యక, నిద్ర అన్నది ఎరగక, విచారంతో కృశించి శల్యమైనాడు.

రెండు మాసాలూ పూర్తికాగానే వర్తకుడు తన కొడుకును రాజు సమక్షానికి తీసుకువెళ్ళాడు. రత్నదత్తుణ్ణి చూడగానే, రాజు "ఇదేమిటోయ్? ఇలా శవంలాగా అయిపోయావు? భోజనం చెయ్యటంలేదా? నిన్ను నేను తిండి తినవద్దని శాసించలేదే?' అని అడిగాడు.

"మహాప్రభూ, నాకు మీరు మరణ దండన విధించిన క్షణంనుంచీ తిండి తిన వద్దనీ, నిద్రపోవద్దనీ శాసించినట్టె అయింది. చచ్చిపోతాననే భయంతో నేనిలా అయి పోయాను," అన్నాడు రత్నదత్తుడు.

"ఏమోయ్, ప్రాణభయం యెలా ఉంటుందో ఇప్పుడైనా తెలుసుకున్నావా? ప్రతి ప్రాణికీ నీలాగే బతికి ఉండాలనే ఉంటుందిగద! అటువంటి ప్రాణాన్ని రక్షించటంకంటె గొప్ప ధర్మం ఏముంటుందో నువే ఆలోచించు," అన్నాడు రాజు.

రత్నదత్తుడికి ఈ మాటలతో జ్ఞానం కలిగింది. అతను ఆక్షణానే రాజు కాళ్లపై పడి తనకు బౌద్ధమతం ఉపదేశించమని దీనంగా వేడుకున్నాడు. రత్నదత్తుడిలో కలిగిన మార్పుకు, రాజు సంతోషించి, అతడికి బౌద్ధమతం ఇప్పించాడు.






## 17

[సమరసేనుడు ఎక్కడ దాక్కున్నదీ తెలుసుకున్న వ్యాఘ్రదత్తుడు అతణ్ణి తన భటులతో ఎదిరించాడు గదా? వ్యాఘ్రదత్తుడి భటులు సమరసేనుడి సైనికులను చాలామందిని చంపగలిగారు. సమరసేనుడు బందీ అయాడు. శివదత్తుడు వెనుకనుంచి వ్యాఘ్రదత్తుణ్ణి ఎదుర్కొన్నాడు. సమరసేనుడూ, వ్యాఘ్రదత్తుడూ పారిపోసాగారు. తరవాత—]

శివదత్తుడు తన అనుచరులతో శిథిలనగరం ప్రవేశించాడని తెలియటం సమరసేనుడికి ఎంతో ఉత్సాహాన్ని కలిగించింది. అతడే గనుక మరికొంచెం ముందుగా వచ్చివున్నట్టయితే తను వ్యాఘ్రదత్తుడికి బందీ అయి వుండేవాడు కాడు. వ్యాఘ్రదత్తుణ్ణీ, అతడి భటులనూ సంహరించి శాక్తేయుడి త్రిశూలాన్ని తను పొందగలిగేవాడు.

కాని యిప్పుడు తను వ్యాఘ్రదత్తుడి చేతిలో బందీఅయిపోయాడు. తనకు చతుర్నేత్రుడితో స్నేహం వున్నదనే కారణం తప్ప తనను చంపేందుకు వ్యాఘ్రదత్తుడికి మరే అటంకమూ లేదు. ఈ అపత్సమయంలో చతుర్నేత్రుడు వస్తే ఎంత బావుండును అనుకున్నాడు సమరసేనుడు.

ఇక—వ్యాఘ్రదత్తుడికీ తన పరిస్థితి విషమంగానే వున్నదన్నట్టు తోచసాగింది. శివదత్తుడికి శాక్తేయుడి త్రిశూలం ఎక్కడ వున్నదీ తెలుసునా? అన్నది ఒక సంశయం. సమరసేనుడు తనకు చతుర్నేత్రుడు మిత్రుడని చెప్పినదాంట్లో వున్న నిజం ఎంత అన్న అనుమానం ఒకటి!





"సమరసేనా! యిక్కడ మనం కొంచెం విశ్రాంతి తీసుకోవచ్చు. శత్రువులనుంచి మనం చాలాదూరం వచ్చేశాం. ఇక భయం లేదు," అన్నాడు వ్యాఘ్రదత్తుడు.

సమరసేనుడికి ఆ మాటలు చాలా ఆశ్చర్యాన్ని కలిగించినై. వ్యాఘ్రదత్తుడు బందీ అయిన తనను మిత్రుడుగా, తనకు మిత్రుడైన శివదత్తుణ్ణి శత్రువుగా చేసి మాట్లాడుతున్నాడు.

"శివదత్తుడు మొదటినుంచీ నాకు స్నేహితుడు. అతణ్ణిగురించి భయపడవలసింది నువ్వుకాని నేను కాదు," అన్నాడు సమరసేనుడు.

ఏది ఏమైనా ప్రస్తుతానికి సమరసేనుణ్ణి చంపటం తనకు క్షేమంకాదని నిర్ణయించుకున్నాడు వ్యాఘ్రదత్తుడు. వీలయితే తను సమరసేనుడితో స్నేహం నటించి బలవంతుడైన శివదత్తుణ్ణి ముందు పరిమార్చటం అన్నివిధాలా చేయదగిన పనిగా ఆసమయంలో ఆతడికి తోచింది.

అందరూ కొండమార్గాన గల యెత్తు పల్లాల్లోనుంచి పరిగెత్తుతున్నారు. శివదత్తుడి అనుచరులతో, తన భటులు యింకా పోరు సల్పుతున్నారనే సూచనగా వాళ్ల కేకలు వినబడుతూవుండటం వ్యాఘ్రదత్తుడికి కొంత ధైర్యకారణంగా వుంది.

పరిగెత్తటంవల్ల బాగా అలిసిపోయిన వ్యాఘ్రదత్తుడు ఒక చెట్టుకు అనుకుని కూర్చుంటూ, సమరసేనుడన్న మాటలకు నిర్విణ్ణుడయాడు. అతడు వెంటనే జవాబిచ్చేందుకు సంశయించాడు. సమరసేనుణ్ణి ఏ విధంగాఅయినా సరే తన పక్షం చేసుకోవటమే మేలని భావించాడు.

"సమరసేనా! నీకు శివదత్తుణ్ణిగురించి అంతగా తెలిసినట్టులేదు. అది అట్లావుంచు. పోతే మనయిద్దరం విరోధులుగా ఉన్నందువల్ల యిద్దరమూ నష్టపడవలసివస్తుంది. ఇదుగో, నిన్ను బంధవిముక్తుణ్ణి చేస్తున్నాను.



తరవాత మనం అన్ని సంగతులూ మాట్లాడుకోవచ్చు," అన్నాడు.

వ్యాఘ్రదత్తుడి ఆజ్ఞ కాగానే యిద్దరు భటులు సమరసేనుడి చేతులకు కట్టివున్న తాళ్ళను విప్పేశారు. సమరసేనుడుకూడా తనున్న సంకటస్థితిలో వ్యాఘ్రదత్తుణ్ణి ఏదో విధంగా మంచిమాటలతో సంతృప్తిపరచటమే తనకు క్షేమమని నిశ్చయించుకున్నాడు. శివదత్తుడు తనకు సహాయపడేందుకు రావచ్చని ఆశకలిగింది.

"శాక్తేయుడి అపూర్వ శక్తులు గల త్రిశూలాన్నిగురించి మనిద్దరికీ తెలుసు. అది ఎక్కడున్నదీ, దానిని పొందగలిగిన వాళ్ళకు వశమయ్యే భోగభాగ్యాల సంగతీ కూడా మనిద్దరికీ తెలుసు. కాని తక్షణం దానివల్ల నువ్వు పొందగోరే లాభమేమిటో నాకు చెప్పగలవా?" అని అడిగాడు సమరసేనుడు.

వ్యాఘ్రదత్తుడు ఆ ప్రశ్న వింటూనే వెలవెలపోయాడు. ఒకవేళ ధనరాసులతో వున్న నావ సంగతి సమరసేనుడికి తెలియదా అనిపించింది. కాని మరుక్షణంలోనే అతడికి సంశయనివృత్తి కలిగింది. ఆ నావలోని ధనరాసులకోసమేగదా సమరసేనుడు యిన్ని అవస్థలు పడుతున్నది అనుకున్నాడు. అందువల్ల దానినిగురించి





తను చెప్పనందువల్ల కలగబోయే నష్టం ఏమీ లేదనుకున్నాడు.

" మనిద్దరికీ సముద్రంలో ధనరాసులతో నిండివున్న నావను గురించి తెలుసు. అందులో మనం ఒకళ్లనొకళ్లం మోసగించుకోగలిగిందేమీ లేదు. పోతే, యీ పట్టున నే నొక సంగతి చెప్పదలిచాను. ఆలోచించి మాత్రం జవాబుచెప్పు. ఆ ధనరాసులతో ఉన్న నావను చెరిసగంగా పంచుకుందాం. ఇష్టమేనా ?" అన్నాడు వ్యాఘ్రదత్తుడు.

" మన యిష్టాయిష్టాల మాట అటుంచి, ముందు ఆ మాంత్రికుల సంగతేమిటి ?" అని నవ్వుతూ ప్రశ్నించాడు సమరసేనుడు.



" ఒకసారి ఆ శాక్తేయుడి త్రిశూలం చేజిక్కించుకున్న తరవాత మనను ఈ లోకంలో ఏ శక్తీ ఎదిరించలేదుగదా ?" అన్నాడు వ్యాఘ్రదత్తుడు.

ఈ జవాబుకు సమరసేనుడు బిగ్గరగా నవ్వాడు. వ్యాఘ్రదత్తుడు దానికి కారణం అర్థంకాక ఆశ్చర్యపడుతూ అతడికేసి అనుమానంగా చూశాడు.

" ఆ శాక్తేయుడి త్రిశూలం యీ నిమిషాన మనకంటె, శివదత్తుడి చేతుల్లోకి పోయే అవకాశం ఎక్కువుంది. ఆ సంగతి గ్రహించావా ?" అన్నాడు సమరసేనుడు.

" శివదత్తుడికి శాక్తేయుడి త్రిశూలం దాచివున్న ఆ ప్రత్యేక స్థలం సంగతి తెలీదు. పైగా నా భటుల్నందర్నీ హతమార్చిందే అతడు చేయగలిగిందికూడా ఏమీలేదు. త్రిశూలం దాచివున్న చోటు గుర్తింపబడిన పటం నాదగ్గిర ఉంది. 'ఏనుగుల వనంలోని విషవృక్షం' అన్నంతమాత్రాన, పటంలోని గుర్తుల సాయం లేకుండా ఎవరూ దానిని వెతికి పట్టుకోలేరు," అన్నాడు వ్యాఘ్రదత్తుడు నిబ్బరంగా.

వ్యాఘ్రదత్తుడు తన మాటలు ముగించీ ముగించకముందే ఆ ప్రదేశమంతా మార్మోగేటట్టు ఏకాకి మాంత్రికుడి వేగు కపాలుడి





కఠోరస్వరం వినబడింది. ఆ శబ్దం వింటూనే సమరసేనుడు లేచి నిలబడ్డాడు. వ్యాఘ్రదత్తుడూ అతడి వెంటవున్న భటులుకూడా భయకంపితులై దిక్కులు చూడసాగారు.

"ఇది చతుర్నేత్రుడి వేగు కంకాళుడు! మీరు వెంటనే పారిపోయి దూరంగా వున్న ఏ గుహలో అయినా దాక్కొనటం మంచిది," అన్నాడు సమరసేనుడు.

వ్యాఘ్రదత్తుడు అనుమానంగా అతడి కేసి చూస్తూ, "చతుర్నేత్రుడు నీ స్నేహితుడని చెప్పావుకదా? అలాంటప్పుడు మనకు వచ్చిన భయమేమిటి?" అని అడిగాడు.

సమరసేనుడు ఇక ఆలసిస్తే తనకు ప్రమాదమని గ్రహించాడు. కంకాళుడు ఏకాక్షిమాంత్రికుడి వేగు! మంత్రవేత్త అయిన చతుర్నేత్రుడికి, అంత బలవంతుడైన మరోశత్రువు ఏకాక్షి అనేవాడు వున్నాడని వ్యాఘ్రదత్తుడికి తెలియటం ప్రమాదమనే, సమరసేనుడు ఆ విధంగా వ్యాఘ్రదత్తుడితో అబద్ధం చెప్పాడు.

"చతుర్నేత్రుడి కంట మీరు పడటం అంత క్షేమంకాదు. ముందుగా నేనతడితో మాట్లాడి తరవాత మీకు పరిచయం కలిగిస్తాను. మీ మంచికే చెపుతున్నాను. మీరు వెంటనే ఏ గుహలో అయినా తలదాచు




కోవటం ఉత్తమం," అన్నాడు సమరసేనుడు ఆదుర్దాగా.

సమరసేనుడు యిలా చెపుతూండగానే 'కపాలా, కాలభుజంగా!' అంటూ ఏకాక్షి కంఠం భయంకరంగా ధ్వనించింది. ఆ ధ్వనికి నివ్వెరపోయిన వ్యాఘ్రదత్తుడూ అతడి భటులూ అక్కడినుంచి పరిగెత్త సాగారు. అదే అదనుగా భావించిన సమరసేనుడుకూడా అక్కడినుంచి లేచి మరో వైపుకు పరుగెత్తసాగాడు.

కొంతదూరం పరిగెత్తి వెనక్కు తిరిగి చూసిన వ్యాఘ్రదత్తుడికి, సమరసేనుడు కూడా పారిపోతూవుండటం వెంటనే అను



మానం కలిగించింది. తన స్నేహితుడని చెప్పిన చతుర్నేత్రుడినుంచి అతడెందుకు పారిపోవాలి అన్న సంశయం కలిగింది. ఇందులో ఏదో మోసం వున్నదనుకున్నాడు.

వ్యాఘ్రదత్తుడు యీ విధంగా ఆలోచించే టంతలో ఏకాక్షి మాంత్రికుడు అక్కడికి రానేవచ్చాడు. అతడి దృష్టి వ్యాఘ్రదత్తుడి మీద ప్రసరించింది. అతడు మండిపోతూ "కపాలా, కాలభుజంగా! చతుర్నేత్రుడి భృత్యుల్ని చుట్టుముట్టండి, వీళ్లను హత మారుస్తాను!" అని భీకరంగా అరిచాడు.

వ్యాఘ్రదత్తుడికి అసరికి పరిస్థితి అర్థమై పోయింది. ఆ వచ్చిన మాంత్రికుడు సమర సేనుడి స్నేహితుడైన చతుర్నేత్రుడు కాదు. తనను మోసగించి సమరసేనుడు పారి పోయాడు. ఇప్పుడు తను చేయవలసిం దేమిటి? ఏదో విధంగా యీ మాంత్రికుడికి తను చతుర్నేత్రుడి అనుచరుణ్ణి కాదనీ, అతడికి శత్రుపక్షంలోని వాడిననీ వెంటనే తెలియచెప్పాలి.

ఏకాక్షి ఆజ్ఞకాగానే అతడి వేగులైన కపా లమూ, కాలభుజంగమూ వ్యాఘ్రదత్తుణ్ణీ, అతడి భటుల్నీ చుట్టుముట్టినై. కాల భుజంగం కోరలు చాచి బుసలుకొడుతూ వాళ్ళచుట్టూ తిరగసాగింది. కపాలం వాళ్ళ




తలలమీద ఎగురుతూ గుండెలదిరేట్టు వికృతంగా అరవసాగింది.

ఏకాక్షి హహ్హహ్హ అని నవ్వుతూ వాళ్ళను సమీపించాడు. అంతలోనే అతడి వికృత మైన నవ్వు ఆగిపోయింది. అతడు భావించి నట్టు తనచేత చిక్కినవాళ్లు సమరసేనుడూ, అతడి సైనికులూ కారని గ్రహించాడు.

"మీరెవరు? కుంభాండుడి అను చరులా?" అని అడిగాడు ఏకాక్షి. వ్యాఘ్ర దత్తుడు వెలవెలపోయాడు. అతడికి కుంభాండు డెవరో తెలియదు.

"నాపేరు వ్యాఘ్రదత్తుడు. నేనీ వ్యాఘ్ర మండలానికి రాజును. తమరుచెప్పే

కుంభాండు డెవరో నాకు తెలియదు!" అన్నాడు వ్యాఘ్రదత్తుడు వణికిపోతూ.

"అయితే నీవీ మృత్యులోయకు అద్దరి నుంచి వచ్చినవాడివి కాదన్నమాట?" అన్నాడు ఏకాక్షి అనుమానంగా చూస్తూ.

"మీరు చెపుతున్న ఆ మృత్యులోయ ఎక్కడ వున్నదోకూడా నాకు తెలీదు. బహుశా ఆ లోయను మేము మరోపేరుతో పిలుస్తూండవచ్చు," అన్నాడు వ్యాఘ్రదత్తుడు భయపడుతూ.

"అయితే సమరసేనుడు అన్న పేరు గలవా డెవణ్ణయినా నీవెరుగుదువా?" అని ప్రశ్నించాడు ఏకాక్షి.

ఏకాక్షి అలా ప్రశ్నించేసరికి వ్యాఘ్రదత్తుడికి పరిస్థితి అంతా అవగాహన అయిపోయింది. ఏకాక్షి మాంత్రికుడు, సమరసేనుడికి ప్రబల విరోధి అని అతడు గ్రహించాడు, ఇప్పుడు తనకు మంచి అవకాశం చిక్కిందని భావించాడు.

"మాంత్రిక మహాశయా! ఆ సమరసేనుడు రెండుమూడు ఘడియలకుముందు నానుంచి తప్పించుకుని పారిపోయాడు. అతడు నాకు ప్రబల శత్రువు. అతణ్ణి బందీగా పట్టుకున్నానుకూడా," అన్నాడు.

వ్యాఘ్రదత్తు డిలా చెప్పేసరికి ఏకాక్షికి కూడా పరిస్థితి అర్థమైంది. సమరసేనుణ్ణి వెతికిపట్టాలంటే వ్యాఘ్రదత్తుడు తనకు సాయంగా ఉండగలడని అతడు భావించాడు. కాని సమరసేనుడితో యితడికి విరోధం రావటానికి గల కారణాలను ముందు తెలుసుకోవాలనుకున్నాడు.

"మీ యిద్దరికీ విరోధం ఎందుకు వచ్చింది? అతడు ఖైదీగా చిక్కి ఎలా పారిపోగలిగాడు?" అని అడిగాడు ఏకాక్షి.

"తమరు సర్వజ్ఞులు. నేను చెప్పవలసిందేముంది?" అంటూ తల వాల్చాడు వ్యాఘ్రదత్తుడు.

(జూన్ సంచికలో ముగింపు)






ఒక గ్రామంలో ఒక గొల్లవాడుండేవాడు. వాడికి నాలుగైదు వందల మేకలుండేవి గాని కుంట పొలంకూడా లేదు. ఈ మేక లన్నీ చేరి తమ పొలాలమీద పడి తింటా యనే భయంతో ఊళ్ళో రైతులు, "నువు రెండు కుంటల పొలమైనా కొనుక్కుంటేనే గాని ఊళ్లో ఉండటానికి వీల్లేదు," అని గొల్లవాడికి తెలియజేశారు.

విధిలేక గొల్లవాడు అప్పుచేసి ఊరికి దూరాన రెండే రెండు కుంటల పొలం కొన్నాడు. అందులో ఇంకే పైరూ కాదని జొన్నలు వేస్తే అదికూడా సరిగా పండలేదు.

కొంతకాలానికి గొల్లకు కళ్ళు కనిపించ కుండా పోయాయి. పొలంపని గొల్లవాడి కొడుకుమీద పడింది. వాడుకూడా తండ్రి లాగా పొలంలో జొన్నపంట వేశాడు.

ఇలా వుండగా ఒకనాడు ధాన్యలక్ష్మి, ధనలక్ష్మి, ధైర్యలక్ష్మి, నేను గొప్పంటే నేను గొప్ప అని తమలో తాము వాదులాడుతూ ఈ జొన్నచేనుదగ్గిరికి వచ్చారు.

"ఈ గొల్లపిల్లవాణ్ణి చూడండి. ఈ కాస్త పొలమూ పండక వీడెన్నో అగచాట్లు పడుతున్నాడు. నే నీ పొలంలో వెళ్ళి కూచున్నానంటే వీడి బాధలన్నీ తీరి పోతాయి," అని ధాన్యలక్ష్మి చేనులో ప్రవేశించింది.

"వీడి కష్టాలన్నీ తొలగాలంటే నీవల్ల ఏమవుతుంది? వీడికి అసలు లాభం నేను చేస్తాను," అంటూ ధనలక్ష్మి డబ్బుమూట రూపం ధరించి, గొల్లపిల్లవాడు చేనునుంచి ఇంటికి వెళ్ళేదారిలో కూచుంది.

"పిచ్చి అమ్మాయిల్లారా! నేను వీడి నెత్తినెక్కితే మీవల్ల ఏమీ లాభంవుండదు," అని ధైర్యలక్ష్మి వాడి నెత్తినెక్కి కూచుంది.

ధాన్యలక్ష్మి చేనులో ప్రవేశించగానే పైరంతా ఏపుగా పెరిగి విరగపండింది.

ఎస్. శివనారాయణ




చెప్పాడు. ఆ పొలం అమ్మేద్దామన్నాడు. దాన్ని ఎవరూ కొనరన్నాడు తండ్రి. కొడుకు దిగులుగా చేనుదగ్గిరికి తిరిగి వచ్చేసరికి ఒక వర్తకుడు ఆ చేనుకేసి రెప్పవాల్చకుండా చూస్తూ కనిపించాడు.

ఆ వర్తకుడు పరదేశి. ఇటువంటి జొన్నపంట ఆయన ఎక్కడా చూడలేదు. గొల్లకుర్రవాడు మంచె ఎక్కబోతుండగా వర్తకుడు, "అబ్బాయీ, ఈ చేను మీదేనా?" అని అడిగాడు. అవునన్నాడు కుర్రవాడు.

"చేను అమ్ముతారా?" అని అడిగాడు వర్తకుడు. అతను మంచి ధర ఇవ్వటం వల్ల కుర్రవాడు ఒప్పుకున్నాడు. ఎట్లాగైనా తన ఆధిక్యత నిరూపించుకుందామని ధనలక్ష్మి గొల్లకుర్రవాడికి సహాయపడసాగింది.

ఆమె వర్తకుడికి మరో ఆలోచనకూడా కలిగించింది. దాని ప్రేరణవల్ల వర్తకుడు, "అబ్బాయీ, నీ కిప్పుడు పొలం లేదుగనక, నెలకు 30 రూపాయలకు నా కింద నౌకరీకి ఉండు. నే చెప్పినట్లల్లా చెయ్యి," అన్నాడు.

కుర్రవాడు సరేనన్నాడు.

వర్తకుడు తన బళ్ళమీది సరుకులన్నీ అవతల పారేసి, వాటిమీద జొన్నమొక్కలు కంకులతో సహా కొట్టించి వేయించాడు. కుర్రవాణ్ణి వెంట తీసుకుని బయలుదేరాడు.

కాని ధైర్యలక్ష్మి నెత్తి నెక్కటంమూలాన ఇదిచూచి గొల్లపిల్లవాడు మతిచెడి, చేనంతా తెగులుపుట్టి నాశనమైపోయిందనుకున్నాడు.

ఈ సంగతి తండ్రితో చెప్పటానికి వాడు ఇంటికి బయలుదేరాడు. ధనలక్ష్మి మూట రూపంలో దారిలో వున్న చోటు సమీపించబోతూండగా వాడి కొక గొప్ప ఆలోచన తట్టింది. "కళ్ళు మూసుకుని పడకుండా ఎంత దూరం పోగలనో చూద్దాం!" అనుకుని వాడు మూట దాటి ఇరవై అడుగులు వేసికాని కళ్లు తెరవలేదు.

తరవాత వాడు ఇల్లు చేరి తండ్రితో పైరంతా చూస్తుండగానే పాడైపోయిందని

పోగా పోగా ఒక పట్నం వచ్చింది. వర్తకుడు ఆ పట్నంలోని రాజుగారి దగ్గిరికి పోయి, " ఈ జొన్నపంట చూశారా? ఇటు వంటిది ప్రపంచంలో ఎక్కడా ఉండదు. వీటిని మీ రాజ్యంలో పండించారంటే ఇక తిండి కొరతే ఉండదు. అంబారితో సహా ఒక ఏనుగు నిచ్చారంటే ఒక బండీ మొక్కలిస్తాను," అన్నాడు.

రాజు అంగీకరించాడు. మరొక బండీడు వర్తకుల కమ్మి వర్తకుడు గొల్లపిల్లవాడికి జరీతో నేసిన బట్టలు కట్టబెట్టాడు. వాణ్ణి ఏనుగుమీద ఎక్కించి, కొన్ని రోజుల అనంతరం మరొక పెద్ద పట్నం చేరాడు.

దారిపొడుగునా వర్తకుడు కనిపించిన వారితోనల్లా, ఏనుగుమీద ఉన్నది బంగారు మహారాజనీ, తాను ఆయన మంత్రిననీ చెబుతూ రావటంవల్ల ఈ పట్నంలోని మహారాజు గొల్లకుర్రవాడికి ఘనంగా, మేళతాళాలతో స్వాగతం ఇచ్చి, అద్దాల మేడలో విడిది ఏర్పాటుచేశాడు.

భోజనాలు చేసి వర్తకుడూ, గొల్లపిల్ల వాడూ దర్బారుకు వెళ్లారు. అక్కడ వర్తకుడు ఆ జొన్నమొక్కలనుగురించి అందరికీ ఇలా చెప్పాడు:

" మా బంగారు మహారాజుగారి రాజ్యంలో ఎంత పనికిమాలిన బీడులో





కూడా ఇలాటి పంట పండుతుంది. అందు కనే శ్రీవారి రాజ్యంలో ఎక్కడ చూసినా బంగారం తప్ప కనబడదు."

రాజుకూ, రాణీకీ ఒక ఆలోచన వచ్చింది. ఈ మంత్రిగారిని మంచి చేసుకుంటే బంగారుమహారాజు తమ కుమార్తెను చేసుకుంటాడేమో నను కున్నారు. వర్తకుణ్ణి పిలిపించి అడిగితే, "శ్రీవారితో చెప్పిచూస్తాను," అన్నాడు.

విడిదిలో వర్తకుడీ విషయం ఎత్తగానే గొల్లపిల్లవాడు అదిరిపడి :

"బాబో, రాచకన్నెలు గడుసువాళ్లు. నే వేగలేను. నాకొద్దు," అన్నాడు.

"వెధవా, నాకింద కొలువున్నావు. నే చెప్పినట్టు చెయ్యకపోతే మక్కెలు విరగ దంతాను," అని మండిపడి, వర్తకుడు రాజుగారింటికి వెళ్ళి పెళ్ళికి ముహూర్తం పెట్టించాడు. అయితే పెళ్ళి తమ దేశాచా రాలప్రకారం జరగాలన్నాడు. అందుకు రాజు ఒప్పుకున్నాడు.

లగ్నంవేళకు పల్లకీ విడిదికి వచ్చేసరికి పెళ్ళికొడుకును నలుగురు నౌకర్లు పెడ రెక్కలు విరిచికట్టి పల్లకీలో పడేశారు.

'ఇవన్నీ వారి దేశాచారాలు కాబోలు' అనుకున్నారు, రాజూ రాణీ.

పెళ్ళితంతు ముగియగానే పెళ్ళికొడు కును పడకగదికి తీసుకుపోయారు.

"గదిబయట విచ్చుకత్తులవాళ్ళద్దరిని ఉంచండి. పెళ్లికొడుకు బయటికి వచ్చి నప్పుడల్లా వాళ్ళు కత్తులు చూపి పొడవ బోయినట్టు నటించాలి," అన్నాడు వర్త కుడు. అదికూడా వారి దేశాచారమే అను కున్నారు రాజకుటుంబంవారు.

పడకగదిలోకి రాగానే గొల్లపిల్లవాడికి కంపరం ఎత్తింది. "బాబో, ఇది అమ్మ వారి గుడే అయిఉంటుంది. నన్ను అమ్మ వారికి బలిఇవ్వటానికే ఈ అలంకారాలన్నీ పెట్టారు," అనుకున్నాడు.



వాడు పారిపోదామనుకుంటే బయట విచ్చుకత్తులవాళ్ళు బెదిరించారు.

ఇంతలో పెళ్ళికూతురు పడకగది ప్రవేశించింది. విచ్చుకత్తులవాళ్ళు వెళ్ళిపోయారు. అన్ని నగలూ పెట్టుకుని దేదీప్యమానంగా వచ్చే రాజకుమార్తెను చూసి, "అమ్మో! ఇంకేముంది? అమ్మవారే! నన్ను తినటానికి వస్తోంది!" అని కంగారెత్తి, రాజకుమార్తెను ఒక నెట్టునెట్టి గొల్లపిల్లవాడు నేరుగా తమ బసకు పరిగెత్తాడు.

వాణ్ణి చూడగానే వర్తకుడు మండిపడి, "దౌర్భాగ్యుడా! నీ మొహానికి రాజు కూతుర్ని కట్టబెడితే పారిపోయివస్తావురా?" అంటూ వాణ్ణి చావచితకగొట్టేశాడు.

మర్నాడు రాజుగారు వర్తకుణ్ణి పిలిపించి, "ఏమిటండీ, మంత్రిగారూ? మీ రాజుగారు మా పిల్లను తోసేసి వెళ్ళిపోయారట. మావల్ల జరిగిన నేరమేమిటీ?" అని అడిగాడు.

"నేరం కాదుటండీ? రాత్రి ఏనుగు తొండమంత ధారతో వర్షంపడిందట. ఇటువంటి వేళ పునస్సంధానమా అని మా రాజుగారు ఆగ్రహపడ్డాడు," అన్నాడు వర్తకుడు.

వాన పడిందీ లేనిదీకూడా విచారించకుండానే రాజుగారు పురోహితులను కొరడా దెబ్బలు కొట్టించి, "సరిఅయిన ముహూర్తం పెట్టండి!" అని ఆజ్ఞాపించాడు.

వాళ్ళు కుయ్యో, మొర్రో అని ఏడుస్తూ, "క్షమించండి, ఈ రాత్రికి మంచిముహూర్తమేనండి," అన్నారు రాజుతో.

రెండోరాత్రికూడా గొల్లపిల్లవాడు అదే విధంగా పారిపోయి బస చేరి వర్తకుడిచేత ఎముకలు విరగ గొట్టించుకున్నాడు.

"ఈ నేరం రెండుసార్లు చేశావు. ఈ రాత్రి పారిపోయి వచ్చావో ఈ కత్తితో నీ గొంతు కోసితీరుతాను. దెబ్బలతో నువు బాగుపడేది కల్ల. ఇక నిన్ను క్షమించేది లేదు. జాగర్త," అన్నాడు వర్తకుడు.

ఆయన రాజుగారిదగ్గిరికి పోయి, "మీ పురోహితులు బొత్తిగా బుద్ధిలేనివాళ్ళులా గుంది. రాత్రి ఏనుగుతలకాయంత ధారతో వర్షం పడిందట," అన్నాడు.

పురోహితులు మళ్లీ దెబ్బలుతిని, "మహా రాజా, క్షమించండి. రాత్రి దుర్ముహూర్తం ఉండినట్టు అనుమానంగా ఉంది. ఇవాళ రాత్రి దివ్యంగా ఉంది," అన్నారు.

మూడోనాడు రాత్రి మళ్ళీ గొల్లపిల్లవాణ్ణి పడకగదిలోకి పంపారు. ఈసారి తన చావు అమ్మవారి చేతిలోనో, వర్తకుడి చేతిలోనో రాసిపెట్టి ఉందని నిశ్చయించేసుకుని వాడు వణుకుతూ కూర్చున్నాడు.

"మీ ఇద్దరి బండారమూ బయట పడిందా?" అన్నది ధైర్యలక్ష్మి మిగిలిన ఇద్దరు లక్ష్ములతో. ఈ మాట అంటూ ఆమె గొల్లవాడి నెత్తిమీదినుంచి దిగివచ్చింది.

వెంటనే గొల్లవాడికి అప్పటివరకూ వున్న ఆలోచనలన్నీ మారిపోయాయి.

"ఈ వర్తకుడెంత మంచివాడు! నాకు ఏనుగూ అంబారీ, జరీబట్టలూ ఇచ్చాడు. నాకొక రాజుకూతుర్ని పెళ్ళాంగా చేశాడు. నేను వెర్రివెధవలాగా ప్రవర్తించరాదు. రాజులాగే ప్రవర్తించాలి. వర్తకుడికి నేను సహాయపడకపోగా, గుట్టు బయట పెట్టేస్తున్నాను. ఛీ, ఛీ! ఇదేం బాగా లేదు," అనుకున్నాడు.

ఈసారి రాజకుమార్తె రాగానే వాడు మర్యాదగా లేచి కుశలప్రశ్నచేశాడు. తన భర్తవైఖరి మారిపోయినందుకు రాజకుమార్తె ఎంతో సంతోషించింది.

చిట్టచివరకు ధైర్యలక్ష్మి అనుగ్రహంవల్ల గొల్లవాడు రాజై శాశ్వతంగా మామగారి రాజ్యంలోనే ఉండిపోయి, ఆయన తదనంతరం రాజైనాడు. వర్తకుడు మంత్రి అయి తన రాజును భక్తిశ్రద్ధలతో సేవించాడు.

ఆ నాటినుంచి ధైర్యలక్ష్మి దారితీస్తేనే గాని ధాన్య, ధనలక్ష్ములు ఎక్కడికీ వెళ్లరు.






# నేరపరిశోధన

శ్రావస్తినగరాన్ని ప్రసేనజిత్తు పరిపాలించే కాలంలో దూరదేశంనుంచి ఒంటరిగాడైన బ్రాహ్మణుడొకడు వచ్చాడు. అదృష్ట వశాత్తూ నగరంలోని గొప్ప వైశ్యులప్రాపకం ఆ బ్రాహ్మణుడికి దొరికింది. నిత్యమూ ఆయనకు అన్నవస్త్రాలు పుష్కలంగా దొరకటమే గాక దానాలూ, దక్షిణలూ, సంభావనలూ దొరుకుతూండేవి. ఒంటరివాడు కావటంచేత ఆయన ఇలా దొరికిన సొమ్మును కొద్దికాలంలోనే వెయ్యి బంగారు దీనారాలుగా నిలవచేసి, దాన్ని మరొక విధంగా భద్రపరచలేక, అడవిలో ఒక చోట పాతిపెట్టేశాడు.

భార్యాబిడ్డలూ, అన్నదమ్ములూ, బంధువులూ, ఎవరూ లేని ఆ బ్రాహ్మణుడి పంచప్రాణాలూ ఆ బంగారంమీదే ఉండేవి. రోజూ ఆయన అడవికి పోయి, తాను పాతిపెట్టిన ధనం ఎవరూ తవ్వుకుపోలేదు గదా అని చూసుకుని తిరిగి ఇంటికి వెళ్తుండేవాడు.

ఒకరోజు ఇలాగే అయన అడవికి పోయి చూసేసరికి అక్కడ బంగారం లేదు. అంతకుముందే దానినెవరో తవ్వి తీసుకున్నారు. ఇది తెలుసుకుని బ్రాహ్మణుడు పిచ్చెత్తిపోయి, గుండెలు బాదుకుని ఏడుస్తూ నగరంలో వచ్చిపడ్డాడు. కనిపించినవారికల్లా తనకు కలిగిన ఆపదనుగురించి చెప్పుతున్నాడు. ఆయనను ఓదార్చటం ఎలాగో ఎవరికీ తెలియలేదు.

"నా డబ్బే పోయాక నేను జీవించటం మాత్రం దేనికి? నదిదగ్గరకు వెళ్లి అందులో పడి ఆత్మహత్య చేసుకుంటాను!" అంటూ బ్రాహ్మణుడు నదికేసి పరిగెత్తాడు.

టి. ప్రసాదరావు



అప్పుడే నదిలో స్నానంచేసి తిరిగివచ్చే రాజు ప్రసేనజిత్తు ఆత్మహత్య చేసుకోబోయే బ్రాహ్మణుణ్ణి చూసి, విషయం తెలుసుకుని, "ఎందుకయ్యా పిచ్చిబ్రాహ్మణుడా, ఆత్మహత్య చేసుకుంటావు? రాజ్యంలో దొంగతనం జరిగితే తెలుసుకునేటందుకు నేను లేనా? నీ సొత్తు అపహరించినవాణ్ణి పట్టుకుంటాను. లేదా, నీ సొమ్ము నా బొక్కసం నుంచి ఇప్పిస్తాను. నువు ఈ డబ్బు పాతిపెట్టిన చోటుకు గుర్తులేమైనా ఉన్నాయా?" అని అడిగాడు.

"మహాప్రభూ, నేను ధనం పాతిపెట్టిన చోట అడవిబీరమొక్క ఒకటి గుర్తుండేది. ఇప్పు డదికూడా పోయింది," అన్నాడు బ్రాహ్మణుడు.

"అడవిబీరమొక్క ఎలా గుర్తవుతుంది. అవి ఎన్నయినా ఉండవచ్చుగదా?" అన్నాడు రాజు.

"లేదు, మహాప్రభూ! ఆ ప్రాంతంలో అదొక్కటే అడవిబీరమొక్క," అన్నాడు బ్రాహ్మణుడు.

"అయితే, నువ్వక్కడ సొమ్ము దాచిన సంగతి ఎవరెవరికి తెలుసు?" అని అడిగాడు రాజు.

"మహాప్రభూ, నాకుతప్ప మరొక పిట్టకు తెలీదు. చెప్పుకునేటందుకైనా నాకెవరున్నారు? నేనక్కడికి పోవటం ఎన్నడూ ఎవరూ చూసివుండలేదు," అన్నాడు బ్రాహ్మణుడు.

రాజు తన భవనానికి తిరిగివచ్చి ఈ దొంగతనంగురించి చాలా తీవ్రంగా ఆలోచించాడు. దొంగను పట్టుకునే ఉపాయం రాజుకు కొద్దిసేపట్లోనే స్ఫురించింది. ఆయన మంత్రిని పిలిపించి:

"మంత్రీ, నాకు ఆరోగ్యం సరిగా లేదు. వెంటనే వైద్యులను చూడటం మంచిదనుకుంటున్నాను. నగరంలో ఉన్న వైద్యులనందరినీ పిలిపించండి," అన్నాడు.

త్వరలోనే వైద్యులంతా వచ్చారు. రాజు ఒక్కొక్కరినే తన సన్నిధికి రప్పించి, "ఏమయ్యా, నువు నిన్నా, ఇవాళ ఏయే రోగాలకు ఔషధం ఇచ్చావు? ఏయే మూలికలు వాడావు?" అని ప్రశ్నించి, వారు చెప్పినదంతా విని పంపివేయసాగాడు. ఇదంతా చూస్తున్న మంత్రికి రాజు అభిప్రాయం కొంచెమైనా అర్థం కాలేదు.

ఆఖరుకు ఒక వైద్యుడు, "మహాప్రభూ, మాతృదత్తుడనే వైశ్యశిఖామణికి అడవి బీరమొక్క రసం నిన్న వాడాను," అన్నాడు.

రాజు ఆసక్తితో, "అలాగా? ఆ మొక్క ఎక్కడ దొరికింది?" అన్నాడు.

"అడవిలో కష్టపడి వెతికి నా సేవకుడు పట్టుకొచ్చాడు, మహారాజా," అన్నాడు వైద్యుడు.

"అయితే ఆ సేవకుణ్ణి మావద్దకు వెంటనే పంపించు," అన్నాడు రాజు.

వైద్యుడి సేవకుడు రాగానే రాజు, "ఒరే, నిన్న నువు అడవిబీరమొక్కను తవ్వినప్పుడు దానికింద దొరికిన వెయ్యి దీనారాలూ ఏంచేశావు?" అన్నాడు.

సేవకుడు తెల్లబోయి, "మా యింట దాచాను, మహారాజా!" అన్నాడు.

"అవి ఫలాని బ్రాహ్మణుడివి. అతడికి వప్పగించు. వెళ్ళు," అన్నాడు రాజు.



చిత్తమంటూ సేవకుడు నమస్కరించి వెళ్ళిపోయాడు.

ఇదంతా పరికిస్తున్న మంత్రికి, రాజే విధంగా ఆ బంగారం ఎత్తుకుపోయినవాణ్ణి గుర్తించాడో అర్థంకాలేదు. రాజునే అడిగి ఆ రహస్యం తెలుసుకోదలిచాడు.

"మహారాజా, మీరీ దొంగతనాన్ని ఇంత సులువుగా ఎలా పట్టగలిగారో నాకర్థం కాలేదు," అన్నాడు మంత్రి.

రాజు నవ్వి ఇలా వివరించాడు:

"దొంగతనంగురించి బ్రాహ్మణుడు చెప్పినదంతా నిజమనే నమ్మకంతోటే నేను దొంగను పట్టటానికి ఆలోచించాను. నగరంలోని ఇన్ని లక్షలమందిలో ఒక్కడే ఆ దొంగతనం చేసివుండాలిగద! అక్కడ ధనం ఉన్నసంగతి ఎవరికీ తెలియదని బ్రాహ్మణుడు చెబుతున్నాడు. ఆ ప్రత్యేక స్థలంలో ధనం ఉన్నదని తెలియకుండా అక్కడ తవ్వవలిసిన అవసరం ఎవరికి కలుగుతుంది? అడవిబీరమొక్కతో పని ఉన్నవాడికి.

"ఆ చుట్టుపక్కల ఎక్కడా అడవిబీర మొక్క లేదు. ఆసంగతి బంగారం పోగొట్టుకున్న బ్రహ్మణుడే చెపుతున్నాడు. అది నిజమేనని నాకు నమ్మకం కలిగింది. అదీగాక, ధనంకోసమే తవ్వినవాడెవడైనా అడవిబీరమొక్కను అక్కడే పారేసి పోతాడు. అడవిబీరమొక్కకోసం తవ్వినవాడైతేనే మొక్కనూ, ధనాన్నీ కూడా తీసుకుపోవటం జరుగుతుంది.

"అయితే అడవిబీరమొక్కతో ఎవరికి పని ఉంటుంది? వైద్యుడికి! అందుచేతనే వైద్యులందరినీ పిలిపించాను. అడివిబీర మొక్కతో వైద్యంచేసిన వైద్యుడు దొరకగానే దొంగకూడా దొరికిపోయాడు. ఇందులో కష్టం ఏమిటి, మంత్రీ?"

ఈ మాటలను విని ప్రసేనజిత్తు తెలివితేటలకు మంత్రి చాలా సంతోషించాడు.





# శివమాధవులు

రత్నపురం అనే నగరంలో శివుడు, మాధవుడు అని ఇద్దరు స్నేహితులుండేవారు. వారొకనాడు ఉజ్జయినికి వెళ్ళాలని నిశ్చయించుకున్నారు. ఎందుకంటే ఉజ్జయినీ రాజుదగ్గిర శంకరస్వామి అనే పురోహితుడు చాలా డబ్బు పోగుచేసి దాచిపెట్టాడని వారు విన్నారు. తమ తెలివితేటలతో ఆ డబ్బంతా సంపాదించి హాయిగా కాలక్షేపం చెయ్యాలని శివమాధవులకు తోచింది.

శివుడు నిష్ఠాపరుడైన బ్రహ్మచారివేషం వేసుకుని ముందుగా ఉజ్జయిని చేరాడు. సిప్రానదీతీరాన ఒక మఠంలో బసచేశాడు. భిక్షాపాత్ర, జింకతోలు—ఇవే అతని ఆస్తి. రోజూ వంటికి బురద పూసుకుని, నదిలో స్నానంచేసి, ఆ నదిఒడ్డునే కొంతసేపు తలకిందుగా నిలబడి తపస్సుచేసేవాడు. తరవాత శివాలయానికి వెళ్ళి దేవుడి ఎదట చాలాసేపు జపంచేసి, ఈశ్వరుడికి ఉమ్మెత్త పూలతో పూజచేసేవాడు. మధ్యాన్నం దాటగానే మూడేమూడిళ్ళలో భిక్షాటనచేసి, తెచ్చిన అన్నం మూడు భాగాలు చేసి, ఒక భాగం కాకులకూ, ఒకభాగం అభ్యాగతులకూ పెట్టి ఒకభాగం తాను తినేవాడు. ఇదంతా చూసి ఉజ్జయినిలో వాళ్ళు, "ఓహో, ఎంత తపస్సంపన్నుడు! ఎంత గొప్పవాడు!" అనుకునేవారు.

కొద్దిరోజులు పోనిచ్చి మాధవుడు రాజపుత్రుడివేషంలో ఉజ్జయిని చేరాడు. అతను తనవెంట కొంత సామానూ, పరివారమూకూడా తెచ్చి, ఒకచోట బసచేశాడు. మాధవుడు వచ్చిననాడే స్నానానికని సిప్రానదికి వెళ్ళి అక్కడ తలకిందుగా తపస్సు చేసుకునే శివుణ్ణి చూసి, భక్తితో సాష్టాంగపడి, "తిరిగి ఎంతకాలానికి తమ దర్శన భాగ్యం లభించింది, మహానుభావా!" అన్నాడు. శివుడు కళ్ళు తెరిచి మాధవుడి

ఓ. అప్పలస్వామి



కేసి చూడనైనా చూడలేదు. మాధవుడు తనబసకు తిరిగివెళ్లాడు.

ఆ రాత్రి శివమాధవులు రహస్యంగా కలుసుకున్నారు. శంకరస్వామి ఆస్తి హరించటానికి పన్నాగం ఆలోచించారు. తెల్లవారకముందే ఎవరి చోటికి వారు గుట్టుచప్పుడుగా వెళ్లిపోయారు.

తెల్లవారగానే మాధవుడు శంకరస్వామి ఇంటికి వెళ్లి, సేవకుడిచేత ముందుగా ధోవతులు కానుక పంపి :

"మాధవుడనే క్షత్రియకుమారుడు చాలా దూరప్రాంతాన్నుంచి తమ దర్శనార్థం వచ్చాడు," అని కబురుచేశాడు.

ఈ శంకరస్వామి చాలా లోభి, వంచకుడు. రాజుగారిదగ్గిర పురోహితుడుగా ఉంటూ, ఎప్పుడు రాజుగారు ఎవరికి ఏ దక్షిణ ఇచ్చినా అందులో సహంవాటా పుచ్చుకుంటూ, చాలా డబ్బు గడించి, దాన్ని చూసి లోకులు ఏమైనా అనిపోతారని, ఏడు బిందెలు ధనంతో నింపి భూమిలో భద్రంగా పాతిపెట్టించాడు.

మాధవుడు పంపిన ధోవతుల కానుక చూడగానే శంకరస్వామికి పరమానందమైంది. ఎవడో అమాయకుడు రానేవచ్చాడనుకుంటూ, అతన్ని లోపలికి పిలిపించాడు. మాధవుడు శంకరస్వామికి నమస్కరించి :

"అయ్యా, మాది దక్షిణదేశం. నన్ను దాయాదులు ఓడించగా ఇక్కడికి పిత్రార్జితంతోసహా వచ్చేశాను. నాకు డబ్బుకేమీ లోటు లేదుగాని, రాజరికానికి అలవాటుపడిన నా అనుచరులు నన్ను కొలువు సంపాదించమని నిర్బంధిస్తున్నారు. మీరు పూనుకున్నట్టయితే నాకు రాజుగారివద్ద కొలువిప్పించగలరు. నాకు మీరీసహాయం చేసినట్టయితే నేను మీకు అన్నివిధాలా అండగా ఉండగలను. నాదగ్గిర రత్నమాణిక్య రాసులున్నాయి," అని మాధవుడు చెప్పాడు.



శంకరస్వామి రత్నమాణిక్యాల పేరు వినేసరికే ఉబ్బి తబ్బిబ్బయిపోయాడు. ఆయన మాధవుణ్ణి రాజుగారివద్దకు తీసుకుపోయి, గట్టిగా చెప్పి, కొలు విప్పించాడు.

"ఈ దేశంకానిదేశంలో మీకు వేరేఇంట అన్ని సదుపాయాలూ అమరవు. అందుచేత మా యింటనే బస చెయ్యండి" అని చెప్పి శంకరస్వామి మాధవుణ్ణి ఒప్పించాడు.

మాధవుడు శంకరస్వామి ఇంట చేరి, రోజూ రాజసభకు వెళ్ళివస్తూ, రాత్రిపూట తాను ఒక బిందెనిండా పోసిఉంచిన నకలు వజ్రాలను ఒకటి రెండు మాత్రం తీసి అవి వెలలేని రత్నాలని శంకరస్వామికి చూపుతూ ఉండేవాడు. శంకరస్వామి నమ్ముతూ ఉండేవాడు.

ఇలా కొంతకాలం జరగనిచ్చి మాధవుడు, తనకు అజీర్తిబాధ కలిగిందని చెప్పి భోజనం మానేశాడు. మర్నాడునుంచీ మంచంపట్టాడు. అయిదారు రోజులకల్లా శుష్కించి శల్యమయిపోయాడు. అతను శంకరస్వామిని పిలిచి, "అయ్యా, నాకు కాలం సమీపించింది. చచ్చేలోపుగా నాదగ్గిర ఉన్న ధనరాశిని ఏసద్బ్రాహ్మణుడికైనా దానంచేసి పుణ్యలోకాలు సంపాదించుకుంటాను. మీ ఎరికలో ఉత్తమోత్తముణ్ణి పిలుచుకురండి," అన్నాడు.






ఎంతమంది బ్రాహ్మణులను తెచ్చినా మాధవుడు, "ఇంకా మంచివాణ్ణి వెతికి తీసుకురండి," అనటం చూసి శంకరస్వామి నిశ్చేష్టుడై పోయాడు.

"అ మఠంలో ఒక బ్రహ్మచారి తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. ఉజ్జయిని యావత్తూ ఘాలించినా అంతకంటె యోగ్యుడు దొరకడు. ఇంకా ఉన్నాడేమో వాకబు చెయ్యండి," అని శంకరస్వామికి ఇరుగుపొరుగువారు సలహా ఇచ్చారు.

శంకరస్వామి మఠానికి వెళ్లి శివుణ్ణి చూసి, "అయ్యా, తమరు రత్నదానం పుచ్చుకోవాలి. వేగిరం రండి," అన్నాడు.

శివుడు నవ్వి, "భిక్షాటనం చేసుకునే బ్రహ్మచారిని, నాకు రత్నదాన మెందుకయ్యా? పద, పద! ఎవరన్నా గృహస్థును చూసి ఇవ్వండి," అన్నాడు.

"అలా కాదు. ఆమనిషి మీకు తప్ప ఈ దానం ఇవ్వడు. మీరైనా ఎల్లప్పుడూ బ్రహ్మచారిగానే ఉండాలని ఏముందీ? దానంపట్టి నిక్షేపంగా పెళ్ళాడి సుఖించండి," అన్నాడు శంకరస్వామి.

"ఇక్కడ నే నెవరి నెరుగుదును! దయచేసి మిదారిన మీరుపొండి. నా కెవరు పిల్ల నిస్తారు?" అన్నాడు శివుడు.

"మా పిల్లనిస్తాను. సరేనా? వేగిరం రండి. అవతల ఆ మనిషికి పొయ్యే ప్రాణం, వచ్చే ప్రాణంగా ఉంది," అంటూ శంకరస్వామి శివుణ్ణి వెంటతెచ్చి, తనచేతి మీదగానే మాధవుడి మాయరత్నాల బిందె ఆతనికి దానం ఇప్పించాడు.

ఇది పూర్తికాగానే మాధవుడి మాయ రోగంకూడా తగ్గిపోయింది. మర్నాడు పథ్యం పుచ్చుకున్నాడు. వారంరోజులలో మామూలు మనిషి అయిపోయి, "ఈ దాన మహిమచేతనేగదా నేను మళ్ళీ బతికి బట్టకట్టాను," అన్నాడు మాధవుడు. అందరూ సంతోషించారు.



అన్న మాటప్రకారం శంకరస్వామి శివుడికి తన కుమార్తెనిచ్చి వైభవంగా పెళ్లి చేశాడు. పెళ్ళి కాగానే మాధవుడు శంకర స్వామి ఇంటినుంచి తన బస మరొకచోటికి మార్చాడు. ఆ స్థానంలో శివుడు వచ్చి కూర్చున్నాడు.

కొంతకాలం మామగారింట మనుగుడు పులు కుడిచి శివుడు, "మామగారూ, నే నెంతకాలం మీమీద పడి బతికేది? నాకున్న ఆస్తి అంతా ఆ దానపుబిందే గనక, అది మీరు తీసుకుని నాకు రొక్కం ఇప్పిస్తే నేనూ నా భార్యా విడిగా కాపరం పెడతాం," అన్నాడు వినయంగా.

"ఆ రత్నాలకు విలువకట్టటం ఎవరి తరమవుతుంది, నాయనా?" అన్నాడు శంకరస్వామి.

"వాటి విలువతో నాకేంపని? ఆ బిందెలో ఏమున్నదీ నేను చూడనైనా లేదు. వాటిని మీరే ఇప్పించారు, మీరే పుచ్చుకుని, మీదగ్గిర ఎంత రొక్కం వుంటే అంతే నా కివ్వండి. అంతే నేను పట్టిన దాన మను కుంటాను. అంటే మీరేగాని పరాయివారు కారుగదా?" అన్నాడు శివుడు.

మారు మాటాడకుండా శంకరస్వామి తాను భూమిలో పాతించిన ఏడు బిందెల సొమ్మూ శివుడికిచ్చేసి అతనిదగ్గిర విక్రయ పత్రం పుచ్చుకుని, అతనికి తాను క్రయ పత్రం రాసి యిచ్చాడు. ఆ సొమ్మంతా కాజేసి శివుడు, తన భార్యతోసహా వేరే కాపరం పెట్టాడు. ఆ సొమ్మును శివమాధ వులు చెరిసగం పంచుకున్నారు.

కొంతకాలం గడిచింది. బిందెలోని రత్నా లలో కొద్దిభాగం అమ్మి ధనపు బిందెలు చేర్చాలని పుట్టింది శంకరస్వామికి. ఆయన బిందెలోనుంచి ఒక రత్నహారం తీసుకు పోయి రత్నవర్తకులదగ్గిర ధర కట్టించాడు.

"స్వామీ! ఇది బంగారమూ కాదు, ఇవి రత్నాలూ కావు. ఇవి ఇత్తడిలో పొదిగిన



గాజుపెంకులు. ఎవరో దుర్మార్గులు మిమ్మల్ని మోసగించారు," అన్నారు రత్నవర్తకులు.

ఇది వినగానే శంకరస్వామికి గుండె ఆగిపోయినట్టయింది. ఆయన త్వరగా ఇంటికి పోయి బిందె తెచ్చి అన్ని నగలూ వర్తకులకు చూపాడు. ఆ బిందెలో ఒక్క చిన్నం బంగారంగాని, ఒక్క వెలగల రవ్వగాని లేదని తేలిపోయింది.

శంకరస్వామి గొల్లున గోలపెడుతూ అల్లుడిదగ్గిరికి వెళ్ళి, "ఎంత మోసం! నా డబ్బు నాకు తక్షణం ఇచ్చెయ్యి" అన్నాడు. బిందెలోవి రత్నాలని అతడు చెప్పినవన్నీ గాజుపెంకులేనని తెలియపరిచాడు.

"అది నా తప్పా? రత్నాలని చెప్పి నా కలాటి దానం ఎందుకు చేయించావు? తపస్సు చేసుకునేవాణ్ణి, నన్ను సంసారకూపంలోకి నువే దించావు. నిన్ను నేనేమనాలి? ఆ బిందె నా చేతితో తాకనైనా లేదు. అందులో రత్నాలే ఉన్నాయో, రాళ్ళే ఉన్నాయో నీకు తెలియాలి, ఆ మాధవుడికి తెలియాలి. నన్నేమీ అడగకు," అన్నాడు శివుడు.

శంకరస్వామి మాధవుడిదగ్గిరికి పరిగెత్తాడు. మాధవుడుకూడా కోపంనటిస్తూ, నానా చివాట్లూపెట్టాడు:

"మా తాతముత్తాతల కాలంనుంచీ ఆ బిందెలో ఉన్న సొత్తు, అపత్సమయంలో సద్బ్రాహ్మడికి దానం చేశాను. ఆ దానం మహత్తెటువంటిదో నేను చావుతప్పి బతికాను. గాజుపెంకులు తీసుకుపోయి నేనెవరికైనా రత్నాలని అమ్మానా? వాటికిమ్మతు నాకేమైనా ముట్టిందా? నువ్వూ, నీ అల్లుడూ చేసుకున్న క్రయవిక్రయాలకు నేనెలా బాధ్యుణ్ణి? చాల్చాలు!"

ఈ మాటలు విని హతాశుడై శంకరస్వామి, తప్పంతా తనదేననీ, తన లోభమే తనను ముంచిందనీ గ్రహించి, చేసేదిలేక ఇంటికి వెళ్ళిపోయాడు.





# ప్రవరుడి భార్య

కాశ్మీరదేశంలో ప్రవరుడనే యువకుడుండేవాడు. అతను ధనవంతుల బిడ్డ, సకల విద్యలూ నేర్చినవాడు, సద్బుద్ధిగలవాడు. అతను దేశాటన చేయగోరి, తగినంత సొమ్మూ, విలువగల వస్త్రాభరణాలూ తీసుకుని బయలుదేరాడు. దురదృష్టవశాత్తూ ఒకనా డతన్ని దొంగలు పట్టుకుని నిలువు దోపిడీ చేసేశారు. ఉన్న డబ్బూ, నగలూ దోచుకుని, అతని వస్త్రాలు తాము ధరించి తమ చింకిబట్టలు విడిచిపెట్టి దొంగలు వెళ్ళిపోయారు. చేసేదిలేక ప్రవరుడు వారి బట్టలు ధరించి, తిండీతిప్పలూ లేకుండానే రెండుమూడు రోజులు ప్రయాణంచేసి బాగా చీకటిపడినాక ఒక నగరం చేరాడు.

ప్రవరుడు నగరం నాలుగు వీధులూ చీకటిలో చుట్టబెట్టాడు. అతన్ని పలకరించి ఎవరూ ఆదరించలేదు. తన దుస్థితి అంతా తెలుపుకుని భోజనం పెట్టమని ఎవరినైనా అడుగుదామంటే అతనికి నామోషీ వేసింది. చివరకతను కోటపక్కనే ఉన్న గుర్రపు సాలవద్దకు చేరి, అక్కడ అరుగుమీద విశ్రాంతి తీసుకోవటానికి కూచుని, ఆకలి శోష వచ్చి స్పృహతప్పి పడిపోయాడు.

ఆ దేశపు రాజు జయసేనుడు. ఆయనకు కాంచనవల్లి అనే కుమార్తె ఉంది. ఆ పిల్ల అందంలో అప్సరస, విద్యలలో సరస్వతి. ఆమె యుక్తవయస్కురాలు కాగానే రాజు ఆమెను చదువు మాన్పించి, వివాహసంబంధం నిశ్చయించాడు. అన్ని విధాలా తనకు తగిన వరుడైతేగాని పెళ్లాడరాదని కాంచనవల్లి పట్టుదల. తండ్రి కుదిర్చిన సంబంధం ఆమె కెంతమాత్రం ఇష్టంలేదు. అందుచేత కాంచనవల్లి ఇంటి నుంచి పారిపోయి, తనకు తగిన వరుడు దొరికేదాకా దేశాటనచేసి, తరవాతనే వివాహంచేసుకుందామని నిశ్చయించింది.

వి. ప్రభాకరరావు



అయితే ఈ పని ఇతరుల సాయం లేకుండా తన ఒక్కతెవల్లా అయేదికాదు. అందుచేత ఆమె తన పరిచారికచేత మంత్రికొడుక్కు వర్తమానం పంపింది. మంత్రికొడుకూ కాంచనవల్లీ ఒక గురువు దగ్గిరే ఒకప్పుడు చదువుకున్నారు. ఇద్దరికీ కూడా చిన్నప్పటినుంచీ చాలా స్నేహం. అర్ధరాత్రి, కోటబయట గుర్రపుసాలవద్ద రెండు గుర్రాలతోసహా సిద్ధంగా ఉంటే తాను వచ్చి విషయమంతా చెబుతానని కాంచనవల్లి మంత్రికుమారుడికి వార్త పంపింది. ఈ వార్త అందుకునికూడా మంత్రికుమారుడు ఆ రాత్రి ఆమెకు సాయ పడలేక పోయాడు. ఎందుచేత నంటే, ఆరాత్రి రాజుగారి అంతఃపురంలో నృత్యం ఏర్పాటుచేశారు. వెళ్ళకపోతే బాగుండదని బలవంతంచేసి మంత్రి, కుమారుణ్ణి నృత్యవినోదం చూడటానికి తీసుకుపోయాడు.

మంత్రికొడుక్కు అంతరాయం కలిగించిన ఈ నృత్యవినోదమే కాంచనవల్లి పారిపోవటానికి తోడ్పడింది. ఆమె తలనొప్పిగా ఉన్నట్టు నటించి, మిగిలినవారంతా వినోదంలో నిమగ్నులై ఉన్న సమయంలో గొలుసుల సహాయంతో కోటగోడ దిగి, గుర్రపుసాలను సమీపించింది. చీకటిలో ఆమెకు, అరుగుమీద ఒళ్ళు తెలియని నిద్రలో ఉన్న ప్రవరుడు కనిపించాడు. అతనే మంత్రికుమారుడను కుని కాంచనవల్లి, "లే, లే! వెంటనే లోపలికి వెళ్ళి, రెండు గుర్రాలు పట్టుకురా! ఆటే వ్యవధి లేదు," అని ప్రవరుణ్ణి గట్టిగా తట్టి లేపింది.

నిద్రమత్తులో ప్రవరుడు లేచి, మారు పలకకుండా సాలనుండి రెండు గుర్రాలు తెచ్చాడు. కాంచనవల్లి ఒక గుర్రం ఎక్కుతూ, రెండవ గుర్రంమీద అతన్ని ఎక్కి తన వెంట బయలుదేరమన్నది. ఇద్దరూ కొద్దిసేపట్లో నగరం దాటి వేగంగా

పోసాగారు. తెల్లవారేసరికి సాధ్యమైనంత దూరం వెళ్ళాలనే ఉద్దేశంతో కాంచనవల్లి అనుచరుడికి వివరాలేమీ చెప్పలేదు.

ఇంతలో తెల్లవారింది. కాంచనవల్లి తన గుర్రాన్ని ఒక చెరువువద్దకు తెచ్చి ఆపింది. కొద్దిసేపట్లో ప్రవరుడు కూడా ఆమెను కలుసుకున్నాడు. అతన్ని చూస్తూనే కాంచనవల్లి ముఖంకూడా, తూర్పుదిక్కుతో బాటు, తెల్లబోయింది. తెల్లవార్లూ తనవెంట వచ్చినవాడు తన స్నేహితుడైన మంత్రి కుమారుడు కాడు. ఈ వ్యక్తి వాలకంచూస్తే ఎవరో దొంగలాగున్నాడు. కుళ్ళుగుడ్డలు కట్టుకున్నాడు. గడ్డం మాసివుంది. ముఖం పీక్కుపోయివుంది. తాను చేసిన పొరపాటు తలుచుకుని కాంచనవల్లికి పట్టరాని దుఃఖం వచ్చేసింది. కాని, ఏడవటం తప్ప ఆమె చెయ్యగలదేమీ లేదు. ఇప్పుడింటికి తిరిగిపోతే తండ్రి కొరత వేయిస్తాడు.

కాంచనవల్లి తల వంచుకుని ప్రవరుడి కేసి చూడనైనా చూడకుండా కూచుంది. ప్రవరుడుకూడా ఆమెను పలకరించలేదు. తానెవరో ఆమెకు చెప్పలేదు. అతను పక్కనున్న చెట్టునుంచి రెండు పలుదోము పుల్లలు విరిచి, ఒకటి కాంచనవల్లి ముందు పడేశాడు. ఇద్దరూ పళ్ళు తోముకున్నారు.



కాలకృత్యాలు తీర్చుకుని ఇద్దరూ మళ్ళీ గుర్రాలెక్కి బయలుదేరి కొంతసేపటికి ఒక నదిదగ్గిరికి వచ్చారు. నది ఒడ్డున ఒక బల్లకట్టు బయలుదేరబోతోంది. అప్పటికే కొందరు దానిమీద ఎక్కారు. తనను ఉచితంగా నది దాటించమని ఒక ముసలామె బల్లకట్టువాణ్ణి వేడుకుంటున్నది. వాడు వీలుపడదని బల్లకట్టు తోసుకుపోబోతూ కొత్తవారిని చూసి ఆగాడు.

బల్లకట్టువాడు ముసలామెను ఊరికే ఎక్కించుకోకపోవటం చూస్తున్న ప్రవరుడు తనదగ్గిరకూడా చిల్లిగవ్వ లేని కారణంచేత కాంచనవల్లివేపు ప్రశ్నార్థకంగా చూశాడు.

ఆమె అతని ఉద్దేశం గ్రహించి కొంగునుండి ఒక బంగారునాణెం తీసి ప్రవరుడి కాళ్ళ దగ్గిర పడేసింది. ప్రవరుడు దాన్ని బల్లకట్టు వాడి కిస్తూ, "ఇదితీసుకుని మాతోబాటు ముసలామెను కూడా ఎక్కనియ్యి," అన్నాడు. బల్లకట్టువాడు ఒప్పుకున్నాడు.

అవతలి ఒడ్డు చేరగానే ఆ ముసలామె ప్రవరుడితో, "నాయనా, నన్ను యేరు దాటించారు. నాకెవరూ దిక్కులేరు. మీతో ఉండనిస్తిరా రెండుపూట్లా ఇంత కాచిపోసి మీ రుణం తీర్చుకుంటాను," అన్నది.

"మాతోపాటు నువ్వూ బతుకుదువుగాని, రా, అవ్వా!" అన్నాడు ప్రవరుడు.

మధ్యాన్నానికల్లా ముగ్గురూ హేలానగర మనే చోటికి చేరారు. ఆరోజు కక్కడ సత్రంలో ఉండి భోజనంచేసి, నిద్ర పోయారు. మర్నాడు ఉదయమే ప్రవరుడు వర్తకుల బజారుకు వెళ్ళి, "అయ్యా, నాకు జ్యోతిషం వచ్చు. మీరు నాకు డబ్బిచ్చి నట్టయితే మీకు దినఫలాలు చెబుతాను. వాటి సహాయంతో మీరు లాభసాటిగా వ్యాపారం చేసుకోవచ్చు," అని చెప్పాడు.

కొందరు వర్తకులు తమ జన్మనక్షత్రాలు అతనికిచ్చారు. ప్రవరుడు వారికి దినఫలాలు చెప్పాడు. వర్తకులు ఎవరికి తోచినంత వారిచ్చారు. ఆ డబ్బు పుచ్చుకుని, ఇంటికి






కావలిసిన సరుకులు తీసుకుని వెళ్ళి ముసలామెచేత వంట చేయించాడు.

మర్నాడు ప్రవరుడు వీధిలోకి వెళ్ళేసరికి చాలామంది వర్తకులు అతనిచేత దిన ఫలాలు చెప్పించుకున్నారు. కిందటిరోజు అతను చెప్పిన ఫలాలు నిజమయాయి. అతనికి సంపాదనమార్గం ఏర్పడింది. అతను ఆ ఊళ్ళో ఒక ఇల్లు అద్దెకు తీసుకుని అందులో ప్రవేశించాడు.

ప్రవరుడి ఖ్యాతి నానాటికి పెరగజొచ్చింది. అతను రత్నాలను పరీక్షించటంలో నిపుణుడని కనిపెట్టి ఒక రత్న వర్తకుడు, అతనికి పెద్దజీతం ఇచ్చి తన వద్ద నౌకరీ ఉంచుకున్నాడు.

కాంచనవల్లి ప్రవరుడి భార్యేనని ముసలామె ఉద్దేశం. కాని వారిద్దరూ ఒకరితో ఒకరు మాట్లాడుకోకపోవటం ఆమె గమనించికూడా, "మొగుడు పెళ్లాల మధ్య ఎన్నో ఉంటాయి. మన కెందుకు ?" అనుకుని ఊరుకున్నది.

ఇలాఉండగా ఆఊరి రాజైన కందర్ప కేతుడివద్దకు దక్షిణదేశ వర్తకుడొకడు అపూర్వమైన రత్నం ఒకటి తెచ్చాడు. దాన్ని చూసి రాజు ముగ్ధుడై దానివెల అడిగాడు. రాజు ఆత్రం గమనించి వర్తకుడు కోటిరూపాయలన్నాడు. నిపుణుల సలహా లేకుండా అంత సొమ్మిచ్చి రత్నం కొనటం ఇష్టంలేక రాజు, నగరంలోని రత్నవర్తకులందరినీ పిలిపించి ఆ రత్నానికి వెల కట్టమన్నాడు. ఎవరికి తోచినట్టు వారు దాని వెల 75 లక్షలు మొదలు రెండుకోట్లదాకా చెప్పారు. ప్రవరుణ్ణి నౌకరీలో ఉంచుకున్న వర్తకుడుకూడా వచ్చాడు. ప్రవరుడికి రత్నాన్ని చూపి వెల కట్టమన్నారు.

"దీనివెల ఒక రూపాయి. అదైనా సాన పట్టినవాడి కూలి మాత్రమే," అన్నాడు ప్రవరుడు. అంతమందిలోనూ దక్షిణదేశ వర్తకుడికి పరాభవమయింది.




"మాట అనగానే సరికాదు! అన్నమాట నిరూపించాలి!" అని అతను గొంతు చించుకుని అరిచాడు.

ప్రవరుడు ఒక ఇనప పలక తెప్పించి రత్నాన్ని దానికేసి కొట్టాడు. అది కేవలం గాజుముక్క కావటంవల్ల ఆ దెబ్బకు పప్పు పప్పయిపోయింది. అది చూచి అందరూ నిర్ఘాంతపోయారు.

ఆనాడే కందర్పకేతుడు ప్రవరుణ్ణి పెద్ద జీతంమీద తన కొలువులోకి తీసుకున్నాడు. అతని సలహా ఎన్నో విషయాలలో రాజుకు అనుకూలించటంచేత ప్రవరుడి పలుకుబడి నానాటికీ పెరుగుతూ వచ్చింది.

ఇది జరిగిన కొద్దికాలానికే కందర్పకేతుడి మంత్రి మరణించాడు. ఆ స్థానం ఆక్రమించటానికి ప్రవరుడుకన్న మరెవ్వరూ కనబడనందున రాజు అతనికి మంత్రిత్వం ఇచ్చి ఆదరించాడు.

ప్రవరుడు మంత్రి అయిన తరవాత అతని స్వవిషయాలు అందరికీ కావలిసి వచ్చాయి. రాజుగారి భార్య చాకలిదానితో మాట్లాడే సందర్భంలో మంత్రిగారి భార్య అప్సరసలాటిదని విన్నది. ఎందుకంటే ప్రవరుడి ఇంటకూడా అదే చాకలిది. ప్రవరుడి భార్య అతిలోకసుందరి అన్నసంగతి రాణిద్వారా రాజు విన్నాడు.

"ప్రవరుడు ఈనాడు మంత్రి అయినాడు కదా, అతను సామాన్యుడుగా ఉన్నప్పుడే అతనికింత అందగత్తె ఎలా భార్య అయింది?" అని రాజుకు సందేహం కలిగింది. ప్రవరుడి భార్య ఎంత అందగత్తో స్వయంగా చూడటానికి రాజు ఒక ఎత్తు వేశాడు. ఒకనాడాయన ప్రవరుణ్ణి తన యింటికి భోజనానికి పిలిచి, రాణిచేత స్వయంగా వడ్డన చేయించాడు.

రాజు ఉద్దేశం ప్రవరుడు గ్రహించాడు. వారి ఆతిథ్యం స్వీకరించిన తాను రాజును తన యింటికి పిలిచి భోజనం పెట్టకా

తప్పదు, తన భార్యగా చలామణీ అవుతున్న కాంచనవల్లిచేత వడ్డన చేయించకా తప్పదు. కాని ఆమె తన యిల్లాలు కానప్పుడు, ఎవరినో ఆతిథ్యానికి పిలిచి, "నువ్వే వడ్డించు," అని అడగటానికి తనకేం అధికారం వుంది?

ఆరాత్రి ఈ సమస్య తేలక ప్రవరుడు పడుకునివుండగా ముసలామె వచ్చి, "భోజనంచేద్దువు, లే, నాయనా!" అన్నది.

"నాకాకలిగా లేదు," అన్నాడు ప్రవరుడు.

తనను గురించిన సమస్యే ప్రవరుణ్ణి బాధిస్తున్నదని కాంచనవల్లి తన సూక్ష్మబుద్ధిచే గ్రహించినదై, "ఏదైనా చెప్పి చేయించుకోవలిసొస్తేచేయించుకోకూడదా, అవ్వా? అనవసరమైన ఆలోచనలు కట్టిపెట్టి భోజనం చెయ్యమని చెప్పు," అన్నది.

ప్రవరుడీమాట విని సంతోషించి భోజనానికి కూచుంటూ, "అది కాదవ్వా, ఇవాళ రాజుగారు నన్ను భోజనానికి పిలిచి రాణిగారిచేత నాకు వడ్డన చేయించారు. వారి ఆతిథ్య ఋణం మనంకూడా తీర్చుకోకపోతే బాగుంటుందా?" అన్నాడు.

"నేనైనా వంటా, వడ్డనా చాతకాని దాన్ని కాను! ఆ రాణిగారికి తీసిపోకుండా నేనూ చేస్తానని చెప్పవ్వా," అన్నది కాంచనవల్లి.



మర్నాడు ప్రవరుడు రాజును భోజనానికి పిలిచాడు. కాంచనవల్లి తనకు చాతనయినంత అద్భుతంగా వంట చేసింది. ఒక రకమైన చీరా, నగలూ, జుట్టుముడీ వేసుకుని వడ్డనచేసి వెళ్ళి, క్షణంలో మరొక రకం చీరెకట్టూ, నగలూ, జడకట్టూ ధరించి మారువడ్డన చేసింది.

రాజుగారు తృప్తిగా భోజనంచేసి ఇంటికి పోయి రాణితో:

"ఇదుగో, మన మంత్రికి మనం అనుకున్నట్టు ఒక భార్యకాదు, ఇద్దరు! రెండు రత్నాలనుకో. ఏం చక్కదనం! ఏం చక్కదనం!" అని ఆశ్చర్యపోతూ చెప్పాడు.

రాజు ఈ విధంగా చెబుతుంటే ఆ అందగత్తెలను స్వయంగా చూడాలని రాణికి కూడా కోరిక పుట్టింది. ఆమె రాజుతో, "ఎల్లుండి అర్థోదయంనాడు సముద్రస్నానానికి భార్యలతోసహా మీ మంత్రిని రమ్మందురూ! మనతోబాటు వాళ్లుకూడా సరిగంగస్నానాలు చేస్తారు" అన్నది. రాజు సరేనన్నాడు.

ఈసారి ప్రవరుడికి పెద్ద సమస్యే కలిగింది. పరస్త్రీని వంటచేసి వడ్డించమనటం అంత తప్పుకాదుగాని తనతో సరిగంగ స్నానం చెయ్యమనటం ఏమన్నా బాగుంటుందా? మొదటనే తనకు వివాహం కాలేదని చెబితే ఇంతదూరం రాకపోను. ఆమె పేరైనా తనకు తెలియదుకద, ఆమెను సముద్రస్నానానికి తీసుకుపోవటం ఎలా?

ఈవిషయమే ఆలోచిస్తూ పడుకున్న ప్రవరుడు ముసలామె భోజనానికి రమ్మంటే, "ఈపూట నాకాకలి లేదవ్వా. మీరు భోజనం చెయ్యండి!" అన్నాడు.

"చీటికీ మాటికీ ఈ అభోజనాలేమిటో కనుక్కో, అవ్వా? ఒకందుకు అధుకున్నవారు ఇంకోఅందుకు ఆదుకోరా? పెట్టి పోషించేవారు చెప్పి చేయించుకుంటే తప్పా ఏం? అడుగవ్వా!" అన్నది కాంచనవల్లి.



ప్రవరుడు తేచివచ్చి భోజనానికి కూచుంటూ రాజుకోరిక అవ్వకి చెప్పాడు.

"ఇదేం పెద్ద సమస్యా ఏమిటవ్వా? ఏడు అందలాలూ, ఏడు రకాల చీరెలూ, రవికలూ, ఏడు వారాల నగలూ తెప్పించమను. సముద్రతీరాన ఏడు గడపల గుడారం వేయించమను. అంతా సక్రమంగా జరిపిస్తానవ్వా!" అన్నది కాంచనవల్లి.

అర్థోదయంనాడు సముద్రానికి మంత్రిగారి మేనాతోబాటు ఏడు మేనాలు వెళ్లాయి. కాంచనవల్లి ఎక్కనది తప్ప మిగిలిన వాటిలో వస్త్రాభరణాలు మాత్రమే ఉన్నాయి. మేనాలు గుడారంముందు నిలిచాయి.

రాజూ, రాణీ కొంగులు కట్టుకుని స్నానాలు చేస్తుండగా గుడారం మొదటి గుమ్మంలోనుంచి ఒకవేషంలో కాంచనవల్లి వచ్చి తనకోసం వేచిఉన్న ప్రవరుడితో కొంగులు కట్టుకుని స్నానంచేసి తిరిగి వెళ్ళిపోయింది. కొంతసేపటికి ఆమె మరొక వేషంలో రెండవ వాకిలిగుండా వచ్చి మళ్ళీ కొంగులు కట్టుకుని స్నానంచేసింది.

ఇదంతా చూసిన రాణి, "అమ్మయ్యో, మీ మంత్రిగారికి ఏడుగురు భార్యలు! అందరూ అణిముత్యాలే" అన్నది.




మర్నాడు రాణి తన పరిచారికను ఒకతెను పిలిచి దానికి ఏడు జరీచీరెలూ, ఇతర కానుకలూ ఇచ్చి, "ఒసే, వీటిని తీసుకుపోయి మంత్రిగారి భార్యలకిచ్చి వారందరి పేర్లూ కనుక్కురావే!" అన్నది.

రాణిగారు దాసిచేత కానుకలు పంపిందని తెలిసి కాంచనవల్లి ముసలామెకు ఒక ఆలోచన చెప్పిపంపింది. ముసలామె దాసితో, "రాణిగారు పొరపడ్డట్టున్నారు. మంత్రిగారికి ఎనిమిదిమంది భార్యలు. వారి పేర్లు శ్రీ కృష్ణుడి భార్యల పేర్లే. ఒకరున్న చోటికి ఒకరు రారు. ఒకరితో ఒకరు పలకరు. ఒక్కొక్కరినే పంపిస్తాను," అన్నది.

దాసి రాణివద్దకు పోయి ఎనిమిదవ కానుకకూడా తెచ్చింది. కాంచనవల్లి ఎనిమిది వేషాలు వేసుకుని వచ్చి ఎనిమిది రకాల గొంతుతో దాసితో మాట్లాడి ఎనిమిది కానుకలూ పుచ్చుకుని లోనికి వెళ్ళింది.

ఇది జరిగిన కొద్దిరోజులకు ఒకనాడు కాంచనవల్లి అవ్వను పురికొల్పి ప్రవరుడికి ప్రతి పదార్థమూ ఎక్కువ ఎక్కువగా వడ్డింపించింది.

"ఇదేమిటవ్వా, ఇవాళ ఇట్లా వడ్డిస్తున్నావు? ఇదంతా తినటానికా, పారెయ్యటానికా?" అన్నాడు ప్రవరుడు.

"తమకు ఎక్కువైతే తినేవారున్నారు లెమ్మని చెప్పవ్వా!" అన్నది కాంచనవల్లి వెనకాలనుంచి.

అప్పటికిగాని ప్రవరుడికి కాంచనవల్లి హృదయం అర్థంకాలేదు. అతను భోజనం చేసి కూర్చునిఉండగా కాంచనవల్లి పళ్లెంలో ఆకులూ, వక్కలూ తెచ్చింది.

"అయితే మన పెళ్ళి ఎప్పుడు?" అని అడిగాడు ప్రవరుడు.

"ఏమండీ, నేను నాకు తగిన భర్తను వెతుక్కోవటానికి ఇల్లు బయలుదేరాను. నాకు భగవంతుడు ఆ క్షణంలోనే మిమ్మల్ని చూపించాడు. కాని నేను గుడ్డివాన్నయిపోయి రత్నాన్ని గాజుపూస అనుకున్నాను. నిస్సహాయ స్థితిలో మీ వెంట వచ్చాను. కాని మీరు నా మర్యాదను కొంచెమైనా అవమానించలేదు. నాకేసి చూడనైనాలేదు. ఇంతకంటె ఉదారుడు నాకెక్కడ దొరుకుతాడు! మీ రెరుగరుగాని నేను చాలా కాలంనుంచీ మీ భార్యనే" అన్నది కాంచనవల్లి.

ఈమాటలు విని ప్రవరుడు చాలా సంతోషించి, తాను పెళ్ళిచేసుకోబోతున్నానని రాజుతో చెప్పాడు. జరిగినదంతా విని రాజు నిర్ఘాంతపోయి, "ఔరా! నీ కాబోయే భార్య ఎంత నేర్పరి!" అన్నాడు.



# గ్రహాలు

సూర్యుడి అడ్డరేఖ నిడివి 867,000 మైళ్ళు. సూర్యుడికి అన్ని గ్రహాలకన్న దూరంగా వున్న గ్రహం ప్లూటో; సూర్యుడినుంచి దీని దూరం 367 కోట్ల 50 లక్షల మైళ్ళు!....ఒక ఫర్లాంగు అడ్డుకొలత గల చక్రానికి అంగుళం లావు గల ఇరుసుమాత్రమే ఉన్నట్టయితే ఇరుసు సూర్యుడవుతుంది ప్లూటోగ్రహం చక్రం అంచున ఉంటుంది. ఇరుసుకూ, అంచుకూ మధ్యగా మిగిలిన గ్రహాలుంటాయి.

సూర్యుడికి అన్నిటికన్న దగ్గిరిగా వుండే గ్రహం బుధుడు. సూర్యుడినుంచి దీని దూరం 3,59,87,000 మైళ్ళు. అంటే, పైన చెప్పిన చక్రంలో ఇది ఇరుసుకు సుమారు మూడున్నర అడుగుల దూరాన వుంటుంది.

బుధుడి తరవాత సూర్యుడికి దగ్గిరగ్రహం శుక్రుడు. ఇది సూర్యుడికి 6,72,45,000 మైళ్ళ దూరాన వున్నది. అంటే, మన చక్రంలో ఇది ఇరుసునుంచి సుమారు ఆరున్నర అడుగుల దూరంలో వుంటుంది.

అదేవిధంగా భూమి సూర్యుడికి 9,29,65,000 మైళ్ళ దూరాన—మన చక్రంలో ఇరుసుకు మూడు గజాల దూరాన—ఉన్నది.

కుజగ్రహం సూర్యుడికి 14,16,50,000 మైళ్ళ దూరాన—మన చక్రంలో ఇరుసుకు 13 న్నర అడుగుల దూరాన—వున్నది.

గురుగ్రహం సూర్యుడికి 48,36,78,000 మైళ్ళ దూరాన—మన చక్రంలో ఇరుసుకు 15 న్నర గజాల దూరాన—ఉన్నది.

శనిగ్రహం సూర్యుడికి 88,67,79,900 మైళ్ళ దూరాన—మన చక్రంలో ఇరుసుకు 28 న్నర గజాల దూరాన—వున్నది.

యురేనస్‌గ్రహం సూర్యుడికి 178 కోట్ల 30 లక్షల మైళ్ళ దూరాన—మన చక్రంలో ఇరుసుకు 57 గజాల దూరంలో—వున్నది.

నెప్ట్యూన్‌గ్రహం సూర్యుడికి 279 కోట్ల మైళ్ళలో—మన చక్రం ఇరుసుకు సుమారు 90 గజాల దూరాన—ఉన్నది.

ప్లూటోగ్రహం సూర్యుడికి 367 కోట్ల 50 లక్షల మైళ్ళ దూరాన వున్నది.

సూర్యకుటుంబంలోని గ్రహాలన్నిటికీ సూర్యకాంతి సమంగా అందటంలేదు. బుధుడి మీద పడే కాంతిలో దాదాపు 4 వ వంతు శుక్రుడిమీదా, సుమారు 9 వ వంతు భూమి మీదా పడుతోంది. భూమిమీద పడే సూర్యకాంతిలో సగంకూడా భూమి అవతల వున్న కుజుడికి చేరటంలేదు. గురుగ్రహానికి చేరే సూర్యకాంతి భూమికి చేరేదానిలో 900 వంతూ, ప్లూటోకు చేరేది 1500 వంతూ ఉంటున్నది. సూర్యుడికి దగ్గిరిగా వుండే మూడు నాలుగు గ్రహాలు తప్పిస్తే మిగిలినవన్నీ అంధకారంలోనే తిరుగుతున్నాయనాలి.

# మాయాచక్రం (అట్టచివరి బొమ్మ) - 7

రాక్షసి కోరికను రాణి తీరుస్తానన్నదికదా! ఆమె ఎవ్వరికీ కనబడకుండా తన వేలిఉంగరాన్ని కళ్ళకు అద్దుకొని, రాక్షసికూతురుకు తాకించింది. అందరకూ ఆశ్చర్యమయేట్టు, మరుక్షణంలో ఆ పిల్ల ఒక చక్కని మానవకన్యగా మారి పోయింది! రాక్షసి ఆనందానికి అంతులేదు.

ఇప్పుడు రాక్షసి, రాణిని ఒక మహాత్మురాలుగా ఎంచి, తనకుతానై ఆమెకు లొంగిపోయింది. లొంగిపోగానే, వివేకవతి ఐన రాణి తనకు మంత్ర దండం కావాలన్నది. మారుమాటాడకుండా, సంతోషపూర్వకంగా రాక్షసి తన మంత్రదండం ఇచ్చివేసింది. అప్పుడు రాణి ఆమెతో 'దీనిని నేను లోకోపకారార్థం ఉపయోగిస్తాను' అని చెప్పింది.

అటుతరవాత రాణి కోటలోపలకు పోయి, బంధింపబడివున్న తన భర్తను చూచింది. ఎప్పుడైతే అనురాగవతి ఐన రాణి కంటబడిందో, ఆ క్షణమందే రాజుకు శాపం తొలగింది. గాడిదతల మాయమై, మామూలురూపం వచ్చేసింది. రాజు విస్మితుడైనాడు.

'నా తొందరపాటును దిద్దుకోడానికి ఇంతపని చేయవలిసి వచ్చింది!' అంటూ రాణి, తన కథ సంతటినీ చెప్పసాగింది. అంతలోనే ఆనాటి దేవత ప్రత్యక్షమై, 'రాణీ!—నా ఉంగరం నాకివ్వు' అని అడిగింది. రాణి ఇచ్చింది. ఉంగరం దేవతచేతికి తాకగానే అది మళ్లీ మాయాచక్రంగా మారిపోయింది!!

అప్పుడు దేవత—'రాణీ!—ఈ చక్రంకోసమే నాకూ రాక్షసికి మధ్యని వైరం. దీనినిగురించే నీ భర్త తీర్పుచెప్పి, నా కిప్పించాడు. ఐతే, ఈ చక్రంవల్లనే నీ భర్తకు శాపం తగిలింది. దాని ఫలితంగా నీవున్నూ కష్టాలపాలైనావు. ఏమైతేనేం చివరకు, ఉంగరంరూపంలో నీకు అంగరక్షగా నేనిచ్చిన ఈ చక్రమే మీ కష్టాలు గట్టెక్కించింది. వృద్ధురాలు, మామిడిచెట్టు, రెక్కలగుర్రం అన్నీ నా కల్పన. ఇటుపైన రాక్షసివల్ల లోకానికి బాధలేదు. ఆమె ఇష్టంవచ్చినచోట ఉండనీ. సుందరవతిగా మార్చబడిన ఆమెకూతురు మిమ్మల్నే ఆశ్రయించుకొనివుంటుంది. ఆమెక్షేమం చూడండి. రెక్కలగుర్రం ఎక్కి మీముగ్గురూ మీ రాజ్యం చేరుకొని, సుఖంగా వుండండి. ఇదుగో, నా మాయాచక్రం తీసుకొని, నే పోతున్నాను!' అంటూ దేవత అదృశ్యమైపోయింది. 

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

**1955 జులై సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు**





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ మే 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : మోసం | రెండవ ఫోటో : హాసం

పంపినవారు : డి. శ్రీదేవి, C/o డి. విశ్వేశ్వరశర్మ, కె. అగ్రహారం, అమలాపురం - (తూ. గోదావరి జిల్లా)

బహుమతిమొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.



# వార్తలు-విశేషాలు

ఆంధ్రరాష్ట్రంలో నూతన మంత్రివర్గం ఏర్పడింది. మార్చి 28-వ తేదీన ఎనిమిదిమంది మంత్రులు ప్రమాణస్వీకారం చేశారు. శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు ముఖ్యమంత్రి. ఉప ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు. ఇక మిగిలిన ఆరుగురు మంత్రులు: శ్రీ కల్లూరు చంద్రమౌళి, శ్రీ కళా వెంకట్రావు, శ్రీ డి. సంజీవయ్య, శ్రీ గౌతు లచ్చన్న, శ్రీ నీరుకొండ రామారావు, శ్రీ ఎ. నాగేశ్వరరావుగార్లు.

*　　*　　*　　*

టిబెట్‌లో 50 సంవత్సరాలుగా, మనదేశంచేత నిర్వహింపబడుతున్న పోష్టల్, టెలిగ్రాఫ్, టెలిఫోన్ సర్వీసులు, ఏప్రిల్ 1-వ తేదీన చైనాకు ఒప్పగించబడినవి. 1954 ఏప్రిల్ 19న పెకింగ్‌లో చైనా - భారతదేశాలు చేసుకొన్న ఒడంబడికప్రకారం ఇది జరిగింది.

*　　*　　*　　*

బ్రిటిష్ ప్రధానమంత్రి సర్ విన్‌స్టన్ చర్చిల్ ఏప్రిల్ 5-వ తేదీన పదవీ విరమణ చేశాడు. ఆయన స్థానంలో విదేశాంగ మంత్రి సర్ ఆంథోనీ ఈడెన్ ప్రధానమంత్రిత్వం స్వీకరించాడు. పదవీ విరమణ చేసిన సర్ విన్‌స్టన్ చర్చిల్ వయసు 80 సంవత్సరాలు. జీవితంలో దాదాపు 55 సంవత్సరాలు ఆయన రాజకీయాల్లో గడిపాడు.

*　　*　　*　　*

ఎవరెస్టు వీరుడు టెన్సింగ్‌నార్కే ఆత్మకథ ప్రఖ్యాత అమెరికన్ రచయిత జేమ్సురామ్సే వ్రాసినది, లండన్‌నుంచి వచ్చేనెల ప్రచురణ కాగలదని తెలుస్తున్నది.



ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధాని అయిన కర్నూలులో విమానాశ్రయం నిర్మించడానికి కేంద్రప్రభుత్వ రహదార్ల శాఖవారు ఉత్తరువులు జారీచేశారు. విమానాశ్రయ నిర్మాణానికి 15 లక్షల రూపాయలు ఖర్చు కాగలవు. ఆరునెలల్లో నిర్మాణం పూర్తిచేయబడుతుంది.

* * * *

ఈ సంవత్సరం జూన్ 27-వ తేదీన రానున్న సూర్యగ్రహణం ఫిలిప్పీన్సులో బాగా కనిపించ గలదని భావిస్తున్నారు. అక్కడ ఏడునిమిషాలపాటు గ్రహణం వుండగలదట. ఈ గ్రహణాన్ని చూడటానికి, పరిశోధనలు చేయటానికి ప్రపంచంలోని చాలా దేశాలనుండి ఖగోళ శాస్త్రజ్ఞులు వెళుతున్నారు.

* * * *

జపానులోని 'ఒకురయామా'లో సాంస్కృతిక పరిశోధక సంస్థ ఒకటి ఉన్నది. ఈ సంస్థకు ఇండియా ప్రభుత్వం—భారతీయ తత్వశాస్త్రంపైన, ప్రాచీన సారస్వతంపైన సామాన్యంగా లభ్యంకాని అనేక గొప్ప గ్రంథాలను బహూకరించింది.

* * * *

ప్రపంచ విజ్ఞాన సమితి మహాసభ ఈసారి ఇండియాలో, నవంబరు నెలారంభంలో జరుప బడుతుందని మద్రాసు యూనివర్సిటీ వైస్ - ఛాన్సలర్ డాక్టర్. ఏ. లక్ష్మణస్వామి ముదలియార్‌గారు చెప్పారు.

* * * *

ఆంధ్రరాష్ట్రంలో రహదారి సౌకర్యాల అభివృద్ధికోసం, ద్వితీయ పంచవర్షప్రణాళికలో చేర్చడానికి వీలుగా, 27 కోట్ల రూపాయిలు ఖర్చుకాగల పథకాలను రహదారి శాఖవారు సిద్ధపరిచారు.

* * * *

ఢిల్లీలో జాతీయ నాటకమందిరం నిర్మించటానికి ప్రభుత్వం యోచిస్తున్నది. దీనికి 75 లక్షల రూపాయలు ఖర్చు కాగలవని విద్యాశాఖ మంత్రికి పార్లమెంటరీ కార్యదర్శి ప్రకటించారు.



# చిత్రకథ



దాసూ, వాసూలు ఊళ్లోకి వచ్చిన సర్కస్ ప్రదర్శనాలకు వెళ్ళారు. అక్కడ ప్రదర్శింపబడిన వాటిల్లో ఏనుగు ఒక పీపామీద నిలబడి, దాన్ని ముందుకు తోసుకుపోవటం వాళ్ళను ఆకర్షించింది. వాళ్ళ ఇంటిపక్కనే ఒక ఖాళీ పీపా వున్నది. 'ఆమాత్రం నేనూ చేయగలను,' అంటూ వాసు ఆ పీపామీదికి ఎక్కాడు.




వాసు కింద పడకుండా పీపాను కాళ్లతో ముందుకు నడుపుకుంటూ పోవటం దాసుకూ, టైగర్‌కూ చాలా అశ్చర్యం కలిగించింది. కాని వీళ్ళెవరికీ కలగని ఆశ్చర్యం, భయంకూడా పీపాలో నివాసం ఏర్పరుచుకున్న ఎలుకకు కలిగింది. అది పీపానుంచి బయటికి దూకేసరికి టైగర్ దాని వెంటపడింది!

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI 'CHAKRAPANI'

Photo by B. Bhansali



బహుమతి
పొందిన వ్యాఖ్య

హాసం

పంపినవారు :
డి. శ్రీదేవి - అమలాపురం

